2.2.1996 శుక్రవారం 12 పేజీలు సంపుటి:68 సంచిక:05 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్ రైతు



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

## మరణం పై ఆరోపణలు- అనుమానాలు!

ఎన్టీ రామారావు పేరులోనే సంచలనం వుంది. ఆయన సినీ, రాజకీయ రంగ ప్రవేశాలు, వాటిలో ఆయన సాధించిన విజయాలు అన్నీ సంచలనాలే. ముఖ్య మంత్రి అయ్యాక ప్రభుత్వ పరంగా ఆయన తీసుకున్న విధాన నిర్ణయాలు కనీ వినీ ఎరుగని సంచలనాలు సృష్టించాయి. అదే ఒరవడిలో ఎన్టీఆర్ మరణం కూడా మరో సంచలనంగా మారనున్నది. తెలుగు దేశం పార్టీలో ఉప్పు - నిప్పు వలె వున్న ఉభయ వర్గాలూ ఎన్టీఆర్ మరణాన్ని సమస్యగా చేసి, రాజకీయ లబ్ధి పొందాలను కుంటుండంతో ఎన్టీఆర్ మరణం సమస్య రావణ కాష్టం అయ్యే సూచనలు కన్పిస్తున్నాయి. ఉభయ వర్గాలు చేస్తున్న ఈ శవ రాజకీయానికి ఆంధ్రావని సిగ్గుతో తలదించుకొని రోదిస్తోంది.

కొరవ 7 పేజీలో

అప్పుడాయన కాళ్ల క్రింద గోతులు త్రవ్విన వారే ఇప్పుడు పాలరాతి సమాధులు కడుతున్నారు!

# ఓట్ల కోసం ఎన్ని పాట్లో!

ఎన్టీఆర్ రాజకీయ వారసత్వం కోసం, ఎన్టీఆర్ మరణపు సానుభూతి ఓట్ల కోసం తెలుగు దేశం పార్టీలోని ఉభయ వర్గాలూ నానా తంటాలు పడుతున్నాయి. ముఖ్యంగా రాష్ట్ర ముఖ్య మంత్రి, నారా చంద్ర బాబు నాయుడు తాను ఎన్టీఆర్‌కు వెన్ను పోటు పొడిచి రాష్ట్ర ముఖ్య మంత్రి పదవిని కబళించానన్న మచ్చను చెరుపు కునేందుకు యమ యాతనలు పడుతున్నారు. ఎన్టీఆర్ బతికుండగా ఆయన్ను పదవీ చ్యుతుణ్ణి చేసి, రోడ్డు మీదకు లాగిన బాబు ఇప్పుడు ఎన్టీఆర్ పై అంతులేని సానుభూతిని కురిపిస్తూ ఎన్టీఆర్‌కు తానే నిజమైన రాజకీయ వారసుడిగా ముద్ర వేయించు కోవడానికి కోట్లాది రూపాయల పథకాలను ఎన్టీఆర్ స్మృతి చిహ్నంగా ప్రకటిస్తున్నారు. ఎన్టీఆర్ అంత్యక్రియలు జరిపిన మరణపుర్వమి ప్రాంతాన్ని ఎన్టీఆర్ గార్డెన్స్‌గా అభివృద్ధి చేస్తున్నట్లు చంద్రబాబు ప్రకటించారు. ముందుగా ఈ ప్రాంతం మొత్తాన్ని "ఎన్టీఆర్ ఘాట్" గా అభివృద్ధి చేయాలని అనుకున్నారు. అయితే ఎన్టీఆర్ మాదిరిగానే భవిష్యత్తులో ఎవరైనా తెలుగు ప్రముఖుడికి ఇక్కడ మరో ఘాట్ నిర్మాణం కోరే అవకాశం వుందనే భయంతో ఆ ప్రయత్నం విరమించి ఎన్టీఆర్ గార్డెన్స్‌గా మార్చారు. రాష్ట్ర సచివాలయానికి పక్కనే, హుస్సేన్ సాగర్‌కు ఎదురుగా వున్న అత్యంత విలువైన స్థలమిది. మొత్తం యాభై నాలుగు ఎకరాలున్న ఈ స్థలంలో చిన్న పిల్లల వినోదం కోసం అప్పు ఘర్ వంటి కేంద్రాన్ని నిర్మించాలని ఎన్టీఆర్ అంటుండే వారు. అయితే ఇప్పుడు ఆయన ఆశయాలకు విరుద్ధంగా ఆయన సమాధితో పాటు చుట్టూ ఎన్టీఆర్ గార్డెన్స్ ఏర్పాటవుతోంది. మొత్తం యాభై నాలుగు ఎకరాల్లో ఐది పదికే స్థలాన్ని బ్రిటిష్ బహుళ జాతి సంస్థ డంకెన్ అండ్ మెకలిన్‌కు చదరపు గజం 12 వేల రూపాయల లెక్కన 10 ఎకరాలు

కొరవ 11 పేజీలో

## స్టేడియంలో చెప్పులు ఎక్కడివి?

ఎన్టీఆర్ భౌతిక కాయం వుంచిన లాల్ బహదూర్ స్టేడియంలో అదే రోజా మూడు లారీల లోడు పాత చెప్పుల్ని కుప్పలుగా పోయించారు. ఈ పని ఎవరు చేశారో అదమిత్థంగా తెలిక పోయినా అధికారంలో వున్న వారి పై ఈ చెప్పులు విసర బడ్డాయి.

### విచారణకు చంద్ర రెడీ

ఎన్టీఆర్ మృతికి దారి తీసిన పరిస్థితులు - ఎన్టీఆర్ మరణించిన సమయం ఎప్పుడు అన్న దాని పై న్యాయ విచారణ జరిపించ టానికి ముఖ్య మంత్రి రంగం సిద్ధం చేశారు. విచారణలో ప్రత్యర్థి వర్గాన్ని ఇరకాటంలో పెట్టే అంశాల్ని పొందు పరుస్తున్నారట. ఇదంతా ఊహించిన లక్ష్మి పార్వతి వర్గం రోడ్ల మీద పడి చంద్రబాబు తమను వేధింపులకు గురి చేస్తున్నారని ఆగం చేయను సిద్ధ మౌతున్నారు.



# అల్లర నాటి ఫైలు ప్రాణం పోసుకుంది!

రాజీవ్ గాంధీ హత్యా నంతరం హైదరాబాదు నగరంలో జరిగిన అల్లర్లలో ఆస్తి నష్టం జరిగిన ఎన్టీఆర్ ఎస్టేట్, ఎన్టీఆర్ సినిమా హాళ్ల నష్ట పరిహారానికి సంబంధించిన ఫైలుకు దుమ్ము దులిపి తిరిగి ప్రాణం పోసే ప్రయత్నం జరుగు తోంది. ఎన్టీఆర్ ఎస్టేట్‌లోని అహ్వానం హోటల్, రామకృష్ణ థియేటర్లు, కాచిగూడలోని తారక రామ థియేటర్లకు అప్పట్లో అల్లరి మూకలు ధ్వంసం చేసి నిప్పు పెట్టాయి. అయితే వీటన్నింటికి ఇన్సూరెన్స్ క్లెయిమ్ ఉన్నందున అప్పట్లో అధికారంలో కాంగ్రెస్ రాష్ట్ర ప్రభుత్వం ఎన్టీఆర్ ఆస్తికి ఎటువంటి నష్ట పరిహారం చెల్లించ లేదు. ఆ తర్వాత వీటి ఇన్సూరెన్స్ పాలసీలు గడువు ముగిసినందున వీటికి క్లెయిమ్ చెల్లించ రాదంటూ ప్రజోపయోగ వ్యాజ్యం కింద ఒకరు కోర్టు కెక్కటంతో ఇన్సూరెన్స్ క్లెయిమ్ అలాగే ఉండి పోయింది. ఇప్పుడు ఎన్టీఆర్ కుటుంబ సభ్యులకు లబ్ధి చేకూర్చేందుకు రాష్ట్ర ప్రభుత్వం ఆ ఫైలును తిరిగి తెరిచి నష్ట పరిహారం చెల్లింపుకు మార్గం సుగమం చేస్తోంది. అహ్వానం హోటల్ మంత్రి వర్గంలో వున్న హరికృష్ణకు చెందినది కావటం ఇక్కడ గమనార్హం.

కొరవ 11 పేజీలో

## స్వర్ణముఖి వంతెనకు మళ్లీ పగుళ్లు

నాయుడు పేట దగ్గర స్వర్ణ ముఖి బ్రిడ్జి మళ్లీ ప్రమాదంలో పడింది. ఎటువంటి దుర్ముహూర్తంలో ఈ బ్రిడ్జి నిర్మాణం తల పెట్టారో కాని దానికి అడుగడుగునా గండాలే!

పది పదిహేనేళ్ల క్రితం తల పెట్టిన నిర్మాణం ఇది. ఎప్పుడో బ్రిటీషు ప్రభుత్వంకట్టిన బ్రిడ్జి బలహీన పడడంతో ప్రత్యామ్నాయంగా దీన్ని తల పెట్టారు. పనిలో పనిగా మామిడి కాలువకూ ఒక బ్రిడ్జి కట్టి, ఒజిలి, నాయుడు పేటలను, రైల్వే లెవల్ క్రాసింగ్‌నూ బైపాస్ చేస్తూ రోడ్డు నిర్మాణం రూపొం దించారు. అన్ని పనులూ పూర్తయిన తర్వాత మొదటి లారీని వదలి పెట్టగానే అంత పెద్ద కట్టడం పేక మేడ వలె కుప్ప కూలింది. ఒక్క మామూలు లారీ బరువునే భరించ లేక పోయిందది. కాంట్రాక్టర్ కక్కుర్తి వల్ల ఈ దుర్మార్గం జరిగిందనే అభిప్రాయంతో ఆ కాంట్రాక్టర్‌ను కోర్టుకు ఈడ్చారు. కాంట్రాక్టర్ పట్ల జనంలో చాలా చులకన భావం ఏర్పడేటట్లు ప్రచారం కూడా జరిగింది. ఆ తర్వాత వేరే కాంట్రాక్టర్‌కు పునర్నిర్మాణం అప్ప చెప్పారు.

హైదరాబాదుకు చెందిన పిచి రాజు అండ్ కంపెనీ పాత కట్టడంలోని శకలాలు కూలద్రోసి, కోటి 16 లక్షల 50 వేల రూపాయల ఖర్చుతో బ్రిడ్జి మొత్తాన్ని తిరిగి నిర్మించింది. అదు

కొరవ 8 పేజీలో




# అక్కడ ధనికులు- ఇక్కడ పేదలు!

ఎన్టీఆర్ దశాహం కర్మ కాండను కూడా ఎన్టీఆర్ కుటుంబ సభ్యులు (ఆ) రాజకీయం చేసి గబ్బు పట్టించారు. తెలుగు దేశంలోని ఉభయ గ్రూపులూ విడి విడిగా దశాహం కార్యక్రమాన్ని నిర్వహించాయి. వాస్తవానికి ఎన్టీఆర్ చితికి నిప్పు పెట్టిన ఎన్టీఆర్ పెద్ద కుమారుడు జయకృష్ణ చేతుల మీదుగా పిండ ప్రదానం జరగాల్సి వుంది. ఉభయ గ్రూపులు జయకృష్ణను తమ తమ శిబిరాలకు ఆహ్వానించాయి. ఎటూ పాలుపోని జయకృష్ణ ఎవరికీ చెప్పకుండా తన కుటుంబ సభ్యుల్ని తీసుకొని శ్రీశైలం వెళ్లి అక్కడ కర్మకాండ నిర్వహించారు. నగరంలో నిజాం కళాశాల ఆవరణలో ఎన్టీఆర్ కుమారులు హరికృష్ణ, బాలకృష్ణ, రామకృష్ణ, మోహన కృష్ణ, సాయి కృష్ణ దశాహం కార్యక్రమాన్ని నిర్వహించి భోజనాలు పెట్టారు. ఇక్కడ పేద వారికి ఒక వైపు, ధనవంతులకు మరొక వైపు భోజనాలు ఏర్పాటు చేశారు. ఎన్టీఆర్ గ్రూప్ తరపున డాక్టర్ దగ్గుబాటి వెంకటేశ్వర రావు, లక్ష్మి పార్వతి బంజారా హిల్స్ రోడ్ నెం. 13 లోని ఎన్టీఆర్ కన్ను మూసిన నివాసంలో భోజనాలు ఏర్పాటు చేశారు. అక్కడకు వచ్చిన వారంతా దాదాపు పేద వారు, బడుగు వర్గాల వారు కావటం గమనార్హం.

## మోటార్ సైకిల్ ధర 5 లక్షలు

జర్మనీకి చెందిన బిఎండబ్ల్యు కంపెనీ భారతీయ మార్కెట్‌లో ఒక ఖరీదైన మోటార్ సైకిల్ విడుదల చేసింది. 650 సిసి సామర్థ్యం కల్గిన ఇంజన్ వుండే మోటార్ సైకిల్ ధర ఐదు లక్షల రూపాయలు. మారుతి, ఫియట్, అంబాసిడర్ వంటి సాధారణ కార్లతో పాటు, ఎస్టీమ్, సీలో వంటి ఖరీదైన కార్ల కంటే కూడా ఖరీదైన ధర ఇది. భారత దేశంలో ఇంత ధర పెట్టి మోటార్ సైకిల్ కొనే వారున్నారా అని అనుమాన పడవవసరం లేదు - బుకింగ్స్ ప్రారంభం కాగానే - ఢిల్లీ, బొంబాయి నగరాలలోనే 750 మంది ఈ మోటార్ సైకిల్‌కు అడ్వాన్స్ చెల్లించారు. మద్రాసు, హైదరాబాదు, బెంగుళూరులలో త్వరలో బుకింగ్ ప్రారంభం కానున్నది.

# డాలర్ ధర ప్రభుత్వమే పెంచుతూందా?

**షేర్‌లోకం** — డాక్టర్ ఎ. దుర్గాప్రసాద్

డాలర్ రేటు అమితంగా పెరిగిపోతుంది. అప్పటి ధర - రు. 36.70 పైసలు. రూపాయి విలువ ఇంతగా పతనం కావడం ఎప్పుడూ జరగ లేదు. విదేశీ ద్రవ్య మార్కెట్‌లో రూపాయి విలువ ప్రతి నిముషమూ పడిపోతున్నది.

మన్‌మోహన్ సింగ్ నాలుగేళ్ల క్రితం రూపాయి విలువను తగ్గించిన తర్వాత డాలర్ రేటు 31.50 పైసల దగ్గర చాలా కాలం స్థిరంగా నిలబడింది. అది మార్కెట్‌కు అనుగుణమైన ధర తప్ప, నియంత్రించింది కాదు. స్వదేశీ మార్కెట్‌లో ద్రవ్యోల్బణం కారణంగా రూపాయి విలువ 15 శాతం వరకు పడిపోయినప్పటికీ, డాలర్ ధరలో మార్పు రాలేదు. ఇటీవలనే డాలర్‌లో హెచ్చు తగ్గులు సంభవిస్తున్నాయి. గత వారంలో రిజర్వు బ్యాంకు ఒక ప్రకటన చేస్తూ - ఇంటర్ బ్యాంకు విదేశీ ద్రవ్య మార్కెట్‌లోని పరిస్థితులే డాలర్ ధరను నిర్ణయిస్తాయి తప్ప, తమ జోక్యం వుండదని స్పష్టం చేశారు. ఈ ప్రకటన తర్వాత డాలర్ ధరలో గణనీయమైన మార్పులు వస్తున్నాయి.

డాలరు రు. 35 ల ప్రాంతంలో వుండినప్పుడు రిజర్వు బ్యాంకు ధర నియంత్రణ కోసం మార్కెట్‌లోకి తన నిల్వలను పెద్ద మొత్తంలో విడుదల చేసింది. కాని ఇప్పుడు అదే రిజర్వు బ్యాంకు డాలర్లను మార్కెట్‌లో కొనుగోలు చేస్తున్నది. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా కూడా గత రెండు మూడు రోజుల నుంచి విపరీతంగా డాలర్లు కొనుగోలు చేస్తున్నది. దీన్ని బట్టి అనుమానం కలుగుతున్న విషయం - డాలర్ ధరను పెంచడం కేంద్ర ప్రభుత్వ వుద్దేశ్యమా అని!

డాలర్ ధర పెరిగితే - ఎగుమతి దారులకు అధికంగా లాభాలు వస్తాయి; దిగుమతుల ఖరీదు పెరిగి, అవి బాగా తగ్గి పోతాయి. ఈ రెండూ జరిగితే బ్యాలన్స్ ఆఫ్ పేమెంట్ పరిస్థితి మెరుగు పడుతుంది. దీనివల్ల విదేశీ మారక ద్రవ్య నిల్వలు స్థిరంగా వుంటాయి. డాలర్ ధర పెరిగినంత మేరా, వారి ద్రవ్యంలో ప్రాజెక్టుల పెట్టుబడి తగ్గిపోయి విదేశీ ఇన్వెస్టర్లు బాగా ఆకర్షితులౌతారు. వంద కోట్ల రూపాయల పెట్టుబడి కావలసిన పరిశ్రమకు ఇది వరకు 30 మిలియన్ డాలర్లు అవసరమైతే ఇప్పుడు 27 మిలియన్లు చాలు విదేశీ ఇన్వెస్టర్లకు ఎంత లాభమో చూడండి! అయితే విదేశీ యంత్రాల పై ఆధారపడే స్వదేశీ పారిశ్రామిక వేత్తలు వంద కోట్ల పెట్టుబడి కావలసిన పరిశ్రమకు 115 కోట్లు పెట్ట వలసి వస్తుంది. దీనివల్ల దిగుమతులు తగ్గి స్వదేశీ యంత్ర పరిశ్రమలకు ప్రోత్సాహం లభిస్తుంది.

షేర్ మార్కెట్‌లోనూ విదేశీ నిధుల ప్రవాహం మొదలౌతుంది. ఇది వరకు 10 డాలర్ల డబ్బుతో 100 రిలయన్స్ షేర్లు కొనే వారికి, ఇప్పుడు అదే 10 డాలర్లతో 200 రిలయన్స్ షేర్లు వస్తున్నాయి. షేర్ల ధరలు తగ్గి, డాలర్ ధర పెరగడం వల్ల విదేశీ ఇన్వెస్టర్లు ఇంతగా లాభ పడుతున్నారు. ఇంకోక ప్రక్క, ఎన్ఆర్ఐ డిపాజిట్లు పెరుగుతాయి. ప్రపంచంలోని ఏ దేశం కరెన్సీకి కూడా ఒక ఏడాదిలో అప్పటి రూపాయి వలె 15 శాతం తేడా రాలేదు.

ఇటువంటి విషయాలు దృష్టిలో పెట్టుకొనే ఆర్‌బిఐ, కేంద్ర ప్రభుత్వాలు పరోక్షంగా, డాలర్ ధర పెరగ డానికి సహకరిస్తున్నాయా అన్న సందేహం కలుగుతూంది.

### బ్యాంక్ డిపాజిట్లకు బహుమతులు నిషేధం

ప్రైవేటు బ్యాంకులు డిపాజిట్ సేకరణకు బహుమతులు ప్రకటించడం; లాటరీలు, స్కీంలు నిర్వహించడాన్ని కేంద్ర ప్రభుత్వం నిషేధించింది. దేశంలో ప్రప్రథమంగా గ్లోబల్ ట్రస్ట్ బ్యాంకు ఇటువంటి ఆకర్షణీయ మార్గంలో డిపాజిట్ల సేకరణకు నడుంకట్టింది. రు25 వేలు డిపాజిట్ చేస్తే ఉచిత సింగపూర్ యాత్ర వంటి ఆకర్షణీయ బహుమతులు ప్రకటించారు. ఈ ప్రచారంలో గ్లోబల్ ట్రస్ట్ బ్యాంకుకు కోట్లాది రూపాయలు వరద వలె వచ్చి పడ్డాయి. తక్కిన బ్యాంకుల వారు అల్లాడి పోయారు. తక్కువ కాలం టర్మ్ డిపాజిట్లకు వడ్డీ రేటును నిర్ణయించుకునే స్వేచ్ఛ వుండడంతో ప్రైవేటు బ్యాంకులు డిపాజిట్ దారులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. ఈ స్వేచ్ఛ లేని జాతీయ బ్యాంకులు వీరి పోటీకి తట్టుకోలేక పోతున్నాయి. ఈ నిషేధం వల్ల జాతీయ బ్యాంకులకు కొంత వూపిరి పీల్చుకొనే వీలు చిక్కుతుంది.

ఇదే మాదిరి నిషేధం తమిళ నాడు నుంచి ప్రతి రోజూ వస్తున్న బెనిఫిట్ ఫండ్‌లు, నిధి కంపెనీలకు కూడా వర్తింప జేయవలసిన అవసరం వుంది. వారు 24 శాతం వరకు వడ్డీ, ఇన్సెంటివ్‌లతో పాటు బంగారు నాణెం ఇస్తామని ప్రచారం చేస్తున్నారు.

### నేషనల్ స్టాక్ ఎక్స్ఛేంజిలో రికార్డు స్థాయి టర్నోవర్

మొన్న 30 తేది నేషనల్ స్టాక్ ఎక్స్ఛేంజిలో రికార్డు స్థాయిలో 945 కోట్ల రూపాయల షేర్ల లావాదేవీల టర్నోవర్ జరిగింది. ఇది రికార్డు స్థాయి టర్నోవర్. ఈ ఎక్స్ఛేంజిలో రోజూ 600 కోట్ల టర్నోవర్ జరుగుతుంది. ఇందులో 65 శాతం వ్యాపారం ఒక్క రిలయన్స్ కంపెనీ షేర్ల మీదనే వుండడం గమనార్హం. 30 తేది జరిగిన 945 కోట్ల టర్నోవర్‌లో 615 కోట్లు మొత్తం రిలయన్స్ షేర్లకు సంబంధించినది.

# 60 పబ్లిక్ ఇష్యూలలో ఒక్కటీ కొనదగినది లేదు!

ఈ వారంలో దాదాపు 60 కంపెనీలు పబ్లిక్ ఇష్యూకు వస్తున్నాయి. వీటిలో 10 కంపెనీలు ప్రీమియంతో షేర్లు విడుదల చేస్తున్నాయి. దురదృష్టకర విషయ మేమిటంటే ఇందులో ఏ ఒక్కటి దరఖాస్తు చేయదగినది కాక పోవడం! కొన్ని కంపెనీలు ఇంకా తమ ధోరణి మార్చు కోకుండా, అక్రమ మోస పూరిత ప్రచారాలతో ప్రజల నుంచి నిధులు సేకరించడానికి యత్నిస్తున్నాయి. కొన్ని కంపెనీల పరిస్థితి చూడండి-

**ఆఫీసు, ఫోనూ లేని కంపెనీలు ఇష్యూ విడుదల చేస్తున్నాయి!**

అలైడ్ క్యాపిటల్ సర్వీసెస్ లిమిటెడ్ అనే కంపెనీ ఆర్‌బిఐ అనుమతి కూడా తీసుకోకుండా పబ్లిక్ ఇష్యూకు వచ్చేస్తున్నది. ఈ ప్రమోటర్లు 17 సంవత్సరాల క్రితం ఒక కంపెనీ పెడితే అది ఇప్పటికీ ప్రారంభం కాలేదు.

క్లాసిక్ గ్లోబల్ ఇంపెక్స్ అనే మరోక కంపెనీకి స్వంత ఆఫిసు, ఫోన్, ఫ్యాక్స్‌లు కూడా లేవు. కాని పబ్లిక్ ఇష్యూ విడుదల చేస్తున్నారు.

ఇన్‌కాన్ ఇంజనీర్స్ అనే కంపెనీ నష్టాలలో కూరుక పోయి వున్న ప్రమోటర్ల ఆధీనంలో వుంది. ఇప్పుడు వచ్చే పబ్లిక్ ఇష్యూ కోసం 1995 సంవత్సరంలో చేసిన అమ్మకాలు చూపుతున్నారు.

స్కంధ ఫార్మ్స్ అనే కంపెనీ ఇంకా భూమి కొనలేదు కాని, కూరగాయలు, పండ్లు పండించి లాభాలు ఆర్జించే పథకం చూపి పబ్లిక్ ఇష్యూకు వస్తున్నది. ఇందులో ప్రమోటర్లు అతి తక్కువ పెట్టుబడి పెడుతున్నారు.

ఏ కంపెనీ చరిత్ర, వర్తమానం చూసినా ఇట్లే తెల్లారు తున్నాయి. ఈ పబ్లిక్ ఇష్యూల జోలికి పోకుండడమే ఉత్తమం.



# హమారా బజాజ్ కాస్తా తుమారా బజాజ్ అయింది!

బజాజ్ స్కూటర్లు తయారు చేసే ఫ్యాక్టరీలో లాకౌట్ ప్రకటించారు. ఆసియాలోనే అతి పెద్ద స్కూటర్ల తయారీ కంపెనీ ఇది. రోజుకు 1200 స్కూటర్లు తయారౌతాయి. స్కూటర్లు, మోటారు సైకిళ్లు, ఆటో రిక్షాలు వగైరాలన్నీ కలిసి ఏడాదికి 5 లక్షల వాహనాలు ఉత్పత్తి చేస్తారు. గత సంవత్సరం వీరి టర్నోవర్ 800 కోట్లు. ఇందులో 50 కోట్ల ఎగుమతు లున్నాయి.

**ఆసియాలో అతి పెద్ద స్కూటర్ల ఫ్యాక్టరీ మూత పడిపోయింది!**

లాకౌట్ వల్ల ఫ్యాక్టరీ మూత పడడంతో బజాజ్ స్కూటర్లకు ప్రీమియం పెరుగుతుంది. ప్రధాన పోటీ దారైన ఎల్ఎంఎల్ వెస్పాకు గిరాకీ కూడా పెరుగుతుంది. కార్మికుల కోర్కెలు తీర్చడంలో నిస్సహాయత ప్రకటించి, లాకౌట్‌కు నిర్ణయించారు. దీనితో హమారా బజాజ్ కాస్తా తుమారా బజాజ్ అయిపోయింది.

### షేర్ల స్విచ్చింగ్ పై విచారణ

కేంద్ర ఆర్థిక మంత్రిత్వ శాఖ దేశంలోని ప్రధాన కంపెనీలు పదింటి షేర్ల బదలీల పై విచారణ జరపమని ఆదేశించింది. యుటిఐ సంస్థ తమ కొన్న 50 లక్షల రిలయన్స్ షేర్లను బదలీకి పంపితే, వాటిని స్విచ్చింగ్ చేసిన విషయం బయట పడిన తర్వాత ఎందుకైనా మంచిదని ఈ విచారణకు ఆదేశించారు. టాటాలు, బిర్లాల ఆధీనంలోని గ్రాసిం, టిస్కో, టెల్కోలతో పాటు ఇతర పెద్ద కంపెనీలైన ఐటిసి, ఐసిఐసిఐ, ఎస్సార్ గుజరాత్, ఎంఎన్‌టిఎల్ కంపెనీల విషయంలో విచారణ జరుగుతుంది. ఈ కంపెనీ లన్నింటికి సంబంధించి 34 వేల కోట్ల రూపాయల విలువ చేసే షేర్లు ఒక్క యుటిఐ దగ్గరే వున్నాయి.

షేర్ల స్విచ్చింగ్, డూప్లికేట్ షేర్ల వల్ల కేంద్ర ఆర్థిక శాఖకు రావలసిన క్యాపిటల్ గెయిన్స్ ట్యాక్స్ రావడం లేదు. దీని నష్టం కోట్లలో వుంటుంది.

◆

# భరించరాని క్రూరత్వం

కొలంబో నగర నడి మధ్యలో, జన సమ్మర్ధమైన ప్రదేశంలో 31 తేది ఉదయం ఎల్‌టిటిఇ నర రూప రాక్షసులు సృష్టించిన మారణ హోమం యావత్ ప్రపంచం గర్హించ వలసిన ఘోరమైన నేరం. ఉదయం 10 గంటల సమయంలో నగర పౌరులు తమ కార్య కలాపాల నిర్వర్తనకు పెద్ద సంఖ్యలో లోపల చేరి వున్న తరుణం గమనించి సెంట్రల్ బ్యాంక్ భవనాన్ని ఆత్మాహుతి దళం సహాయంతో పేల్చి పారేశారు ఎల్‌టిటిఇ ముష్కరులు. రెండు వేల మంది ప్రాణాలు ఒకే ఒక క్షణంలో ప్రమాదంలో పడవేశారు. అదృష్టం బాగుండి చావుల సంఖ్య వందలకే పరిమిత మైంది కాని, లేకుంటే ఆ మారణ హోమంలో వేల ప్రాణాలు సమిధలై పోయి వుండేవి. ఒక లారీ నిండా 4 టన్నుల బాంబులు పేర్చి, ఆత్మాహుతి దళం సహాయంతో బ్యాంకు భవనాన్ని ఢీ కొట్టించి, పేల్చి పారేశారు. ఆ ప్రేలుడుకు కిలో మీటరు పరిధిలో భవనాలు కుప్ప కూలాయి. ఎక్కడి వారు అక్కడే రక్త మాంసాలు చిదురు చిదురై పోయి చచ్చారు. ఎక్కడో పొర్చురులో వుండే వాకలూ ధ్వంసమై నాయంటే ఆ బాంబుల తీవ్రత అర్థం చేసుకోవచ్చు.

ఇంత ఘోరమైన మారణ హోమం సృష్టించి ఎల్‌టిటిఇ కిరాతకుడు ప్రభాకరన్ సాధించిన విజయమేమి వుంది? చని పోయిన వారంతా అమాయక పౌరులు; అన్నెం పున్నెం ఎరుగని సాధారణ పౌరులు. వారికి ఎవరితోనూ శత్రుత్వం లేదు; ఎవరి రాజకీయ లాభ, నష్టాలకూ వారు ప్రేరకులు కారు, కారకులూ కారు. చచ్చిన వారు ఒక జాతి ప్రజలు, ఒక భాషా ప్రాంతీయులు, ఒక రాజకీయ నిబద్ధతకు కట్టు బడిన వారూ కాదు. అందులో సింహళీ యులున్నారు; తమిళు లున్నారు; భారతీయు లున్నారు; ఇతర దేశాల పౌరులూ వున్నారు. వారందరినీ చంపి, వారి పుర్రెలతో మాల చేసుకొని మెడలో వేసుకున్నంత మాత్రాన ప్రభాకరన్ ఏమి సాధించినట్లు లెక్క వుతుంది?

ప్రభుత్వ సైనిక దళాలతో పోరు సల్పలేక, ఓటమి పాలై, వికల మనస్కుడై, ఏమీ చేయలేని అక్కసుతో ఈ అమాయకులను వధించి తన రక్త దాహం తీర్చుకున్నారు ప్రభాకరన్. అతడు పూర్తిగా పిచ్చి వాడై పోయిన ట్లున్నాడు. ఆ పిచ్చిలో అతడి మనసు నిండా దానవత్వం నిండి పోతున్నట్లుంది. అందువల్లే ఇంత విచక్షణా రహితంగా, క్రూరంగా ప్రవర్తిస్తున్నాడు.

ప్రపంచ మంతటా వివిధ దేశాలలో స్థానిక రాజకీయ, జాతి విద్వేష, సాంఘిక కారణాలతో ఉగ్రవాదం, గెరిల్లా పోరాటాలు జరుగు తున్నాయి కాని, ఎల్‌టిటిఇ వలె పాశవికంగా ఎవరూ ప్రవర్తించడం లేదు. ప్రపంచ వ్యాప్తంగా వుండే తమిళులలో వాత్యంవ కారం రెచ్చగొట్టి, ఉన్మాదం ప్రేరేపించి, అపార ధనరాశులు ప్రోగు చేసుకొని, ఆధునిక ఆయుధాలు సేకరించి ఇటువంటి మారణ హోమాలు సృష్టించడం ప్రభాకరన్‌కు మంచి నీళ్ల ప్రాయమై పోయింది. అంత ర్జాతీయ ఉగ్రవాదానికి భయానక కిరాతకత్వం సంతరించి పెరుగుతున్నా డతడు. ఎక్కడో అడవులలో దాగుకొని, ఆత్మాహుతి దళాలు సృష్టించి పురాణాలలోని రాక్షసులు కూడా సిగ్గు పడే రీతిలో రక్తపు టేరులు ప్రవహింప జేస్తున్నాడు.

ఇది సహించరాని దుర్మార్గం; భరించలేని ఘోరం. శ్రీలంక ప్రభుత్వం ఇంక ఏ మాత్రం ఈ పిచ్చి పట్టిన రాక్షస పోకడలను మంచితో, మాటలతో దారికి తేవడం అసాధ్యం. ప్రభాకర్ కిరాతక మూకల పై ఒక్క క్షణం అలస్యం చేయకుండా సైనిక బలాన్ని ప్రయోగించి, నిర్దాక్షిణ్యంగా అణచి వేయ వలసిన అవసరం వుంది. ప్రభాకరనే కాదు - ఒక్క ఎల్‌టిటిఇ సైనికుడు, సానుభూతి పరుడు బ్రతికి వుండినా సభ్య సమాజానికి ప్రమాద కరమే. అడవులలో పొంచి వున్న ఈ విష సర్పాలను వెతికి పట్టి, ఆనవాలు కూడా లేకుండా అణచి పారేయడం సమాజ శ్రేయస్సుకు సల్పే కృషిగా పరిగణింప బడుతుంది.

ఎల్‌టిటిఇతో శ్రీలంకకు ఎంత చేటు వుందో, భారత దేశానికి అంతే కీడు వుంది. ఆ రాక్షసులు ఏ క్షణంలోనైనా, ఏ ప్రాంతం లోనైనా తమ పంజా విసిరి, రక్త ప్రవాహం సృష్టించ గల్గినంత చేరువలో వున్నారు మనకు. ప్రక్కలో నాగు పామును పంచేసు కున్నట్లు ఇంత కాలం మన తమిళ సోదరులు వీరిని పెంచి పోషించారు. రాజీవ్ గాంధీ కిరాతక హత్యతో దాని విష ప్రభావం మనం అనుభవించాం. వీరి అగడాలను సహిస్తే ఏ క్షణంలోనైనా కొలంబో సెంట్రల్ బ్యాంకు భవనం వలె మన రిజర్వు బ్యాంకునో, సెక్రెటేరియట్‌నో పేల్చి వేసి పీనుగుల కుప్పలు పోయగల నీచులు వారు. భారత, తమిళ నాడు ప్రభుత్వాలు; సరిహద్దుల్లోని తమిళ ప్రజలు ఈ వాస్తవం గుర్తెరిగి ఎల్‌టిటిఇ భూతాన్ని భారత భూభాగం నుండి తరిమి కొట్టడానికి కృషి చేయాలి. ఏ మాత్రం జాలి, సానుభూతి, అభిమానాలకు నోచుకోని దానవత్వం మూర్తీభవించిన దుష్ట శక్తులుగా వారిని పరిగణించి వెలి వేయాలి.

## జమీన్‌రైతు

2.2.1946

వెల: 0-1-6 పేజీలు:8

### భారత స్వాతంత్ర్యానికి తేదీ చెప్పలేను

శాసన సభా సభ్యుల సహాయానికి వైస్రాయి విజ్ఞప్తి

23 తేది కేంద్ర శాసన సభలో లార్డు వేవెల్ ఉప న్యసించారు.

ఆశ్చర్య పరచలోయే క్రొత్త ప్రకటనలేవీ నేను చేయ బోవడం లేదు. ప్రజా పరిపత్తు భను సాధ్యమై నంత త్వరలో సమావేశ పరచ డానికి బ్రిటిష్ ప్రభుత్వం దృఢ నిశ్చయంతో కలదని మీకు చెప్ప కోరుచున్నాను.

యీ పరిషత్సభ, కొత్త కేంద్ర కార్యవర్గము ఏ విధముగా ఏర్పాటు కాగలదో నేనిప్పుడు చెప్పలేను. భారత దేశ స్వాతంత్ర్యం పొంద డానికి తగు చర్యలు ఎప్పుడు తీసుకో బడతవో తేదీలు నేనిప్పుడు చెప్పలేను. కాని ఢిల్లీలోను, లండన్‌లోను భారత [illegible] పరిష్కారం సత్వరమే జరగలాని భావించ బడుతున్నదని మాత్రము చెప్పగలను".

మీలో కొంత మంది ప్రతి సమస్యలోను, వీలైనన్ని పార్టీ ప్రభుత్వాన్ని ఓడించాలనితలంచ వచ్చును. యిదే మీ రాజకీయ బాధ్యత అయిన ట్లయితే నేను మీకు చెప్పేదేమీ లేదు. కాని దేశానికి మేలు చేకూర్చే శాసనాలు చేయడంలో విలంబన జరపడం ప్రాప్త దృష్టి కాగలదని నేను భావించ వచ్చును అది నిర్ణయం చేయ వలసినది మీరు.

గొప్ప రాజ్యాంగ మార్పు లన్నింటిలోను వివిధ పక్షాలు సుహృద్భావంతో పరస్పర విశ్వాసంతో వ్యవ హరిస్తేనే విజయం పొంద గలము.

వైస్రాయి ఉపన్యాసానికి కాంగ్రెసు, అకాలీ పార్టీ సభ్యులు హాజరు కాలేదు. మహమ్మదాలీ జిన్నా వైస్రాయి ఉపన్యాసం ప్రారంభించే సమయంలో శాసన సభకు వచ్చాడు. అసెంబ్లీ స్పీకర్ మవలంకర్ గాంధీ టోపీ తెల్లని షేర్వానితో వున్నాడు.

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

### పల్లెటూళ్లు

**వెంకటగిరి**

రేషనింగ్: డిప్టీ కలెక్టరు అర రేషన్‌ను, జిల్లా కలెక్టరు పూర్తి రేషన్ చేశారు. మళ్లీ పరిరేషన్ తగ్గించడం వల్ల ప్రజలు బాధ పడుతున్నారు. "హొరేదు నెయ్యి, నోరెడన్న మునుతిన్న భారతీయుల కక్కుట నేటికి దాపరించె... కమ్మని కూడులేని చెడు కాలక మిదో"

**కావలి**

బియ్యపు కట్టలకు చీట్లివ్వడంలో శానటరీ మేస్త్రికి, చిల్ కలెక్టరకు భేదం చూపించడంలో కారణ మేమరైనా చెప్పగలరా?

కొరవ10వ పేజీలో

# సర్వేపల్లి చెరువు నీళ్లకు, ఎమ్మెల్యేకు ఏమిటి సంబంధం?

రెండు వారాల క్రితం ఇదే శీర్షికలో ఈపూరు వెంకురెడ్డి గారు సర్వేపల్లి చెరువుకు నీళ్లు రావడం ఎమ్మెల్యే శ్రీ సోమిరెడ్డి చంద్ర మోహన రెడ్డి పుణ్యమేనని పెద్దగా ప్రశంసించారు. కానీ అది పూర్తిగా అసత్యం. సర్వేపల్లి చెరువు నీళ్లకు, ఎమ్మెల్యేకూ ఏమిటి సంబంధం?

ఈ లేఖ వ్రాసిన ఈపూరు వెంకురెడ్డి గారికి చెరువు పరిధిలో ఒక్క సెంటు భూమి లేదు. నీళ్ల గొడవే ఆయనకు తెలియదు. అసలు సోమశిలలో పుష్కలంగా నీళ్లు వున్నప్పుడు సర్వేపల్లి ప్రధాన కాలువ రిపేరు చేయకుండా, నీళ్లు వదలకుండా, అర్థం పర్థం లేని కాంట్రాక్టు పనుల కోసం చెరువును ఎండ బెట్టిన ఘనత ఎమ్మెల్యేది. అప్పుడాయన సక్రమంగా వ్యవహరించి వుంటే నీళ్ల కరువే వుండేది కాదు. నవంబరు, డిసెంబరు నెలల్లో పైర్లు ఎండి పోతున్నాయని రైతులు గగ్గోలు పెట్ట వలసి రావడం చరిత్రలో ఎప్పుడూ జరగలేదు. అది ఆయన పుణ్యమే.

రైతులు పైర్ల బాధను చెప్పుకోను ఇరిగేషన్ ఆఫీసుకు వెళ్తే ఎమ్మెల్యే గారు ఏదో పని మీద అక్కడికి వచ్చారే తప్ప రైతు సమావేశం ఆయన నిర్వహించ లేదు; అసలు సమావేశమే జట్లు జట్లుగా ఏర్పడి కాలువల్లో నీటి ప్రవాహాన్ని నిరోధిస్తుండిన గుర్రపు గిట్టాకును శ్రమదానంతో తొలగించు కోవడంతో చెరువుకు నీళ్లు చేరాయి తప్ప ఎమ్మెల్యే చేసిన వుపకారం ఏమీ లేదు.

నెల్లూరు జిల్లాకు 3 వేల క్యూసెక్కుల నీరు వదిలారని ప్రకటించారే తప్ప, అప్పుడు చుక్క నీరు రాలేదు. అది కేవలం బూటకపు ప్రకటన. ఆ తర్వాత రైతులు 15 ట్రాక్టర్లలో కలెక్టరేట్ వద్దకు వెళ్లి రచ్చ చేయడం; మాజీ ఎమ్మెల్యే శ్రీ సివి శేషారెడ్డి నాయకత్వంలో కండ్లేటి రిజర్వాయర్ వద్దకు వెళ్లి సోమశిల నీరు మద్రాసు కోసం వదలి పెట్టిన వాస్తవం చూసి, గలభా చేయడంతో కలెక్టర్‌కు పూసిరాడక సోమశిల నుంచి దిగువకు నీరు వదలడం జరిగింది.

ఈ ఏడాది సర్వేపల్లి రైతాంగం నీళ్ల కోసం పడిన బాధలు అన్నిన్ని కావు. అప్పుడంతా గమ్మునుండి, అంతా అయిపోయాక తామే భగీరథులమని చెప్పు కోవడం అన్యాయం. ఈ అసత్య ప్రచారాలు రైతులు విశ్వసించరు.

-చుక్కపల్లి కృష్ణయ్య నాయుడు

## జనవాణి

### దీపముండగానే ఇల్లు చక్క బెట్టుకొన్న ఎమ్పీ

గత పార్లమెంటు ఎన్నికల సమయంలో జనార్దన రెడ్డి గారు ముఖ్య మంత్రిగా వుండే వారు. తనదైన బాణీలో ఎమ్పీ టిక్కెట్‌ను బి.యిడి పాసై వుండిన కుటుంబ సభ్యురాలికి ఇప్పించారు. ఆమె దీప ముండగానే ఇల్లు చక్క బెట్టుకొనే సామెతను అనుసరించారు. ఈసారైనా నెల్లూరు నాయకులు అసమర్థులకు టిక్కెట్ ఇప్పించ కుండా సమర్థులైన వారికి ఇప్పిస్తే పార్లమెంటులో నెల్లూరు బాణీని వినిపింప జేసి రెండు, మూడు పనులైనా సాధించి పెడతారు. వర్గ ప్రయోజనాల కోసం జిల్లా ప్రజల ప్రయోజనాలను నేతలు ఈసారైనా కాల రాయరని నమ్ముదాం.

నెల్లూరు -బి.డి. యాదవ్

### పోలీసుల వైఖరి మారదా?

నేడు ఏ పత్రిక తిప్పినా ఏదో ఒక చోట పోలీసుల దౌర్జన్యాలు, లాకప్ మరణాలు ప్రతినిత్యం దర్శన మిస్తున్నాయి. ప్రభుత్వం ఇచ్చే జీతానికి నాలుగింతలకు పైగా సంపాదించే పోలీసులు ఎక్కువయ్యారు. యూనిఫారం, టోపీ, లాఠీ చేతికి

### ఎన్టీఆర్ చితాభస్మ ప్రహసనం

# అస్థికలు నెత్తిన పెట్టుకొని అసహ్యంగా ప్రవర్తించారు!

అధికార చంద్రబాబు నాయుడు, అనధికార లక్ష్మీ పార్వతి వర్గాలు 28 తేది ఎన్టీఆర్ అస్థికలు పెన్నలో కలిపేందుకు పోటీలు పడ్డాయి. కో ఆపరేటివ్ బ్యాంకు, వి.ఆర్. హై స్కూల్ గ్రౌండ్‌లలో పెట్టిన అస్థికలను చూడను జనాలు రాక పోయేసరికి అవాక్కైన ఇరు వర్గం నాయకులూ అస్థికల ప్రదర్శనకు జిల్లాలోని వివిధ ప్రాంతాల నుండి వాహనాల్లో జనాలను తరలించారు. ఇరు వర్గాల ఊరేగింపులకూ నిముషాల తేడా మాత్రమే వుండడం; అస్థికల కలశం సాగే మార్గం పై అధికార వర్గం నాయకులు పోలీసులతో ఘర్షణ పడడం చూసే వారికి అసహ్యమనిపించింది. అస్థికల నిమజ్జనాన్ని కూడా (ఆ) రాజకీయం చేసిన నాయకులను ఎన్టీఆర్ అభిమానులు బహిరంగంగా తిట్టడం కనిపించింది. అస్థికల నిమజ్జనాన్ని పార్వతి వర్గం ఉదయం, చంద్రబాబు వర్గం సాయంత్రం చేసుకోమని పోలీసులు సలహా యిచ్చారు. కాని ఇరు వర్గాలూ దీన్ని అంగీ కరించక మధ్యాహ్నం 3 గంటలకు ఒక వర్గం, 3.30 కి మరో వర్గం చేస్తామని చెప్పారట. కాని చెప్పిన సమయానికి ఇరు వర్గాల శిబిరాల్లో జనాలు లేక పోవడంతో ప్రసన్న వర్గీయులు 4.30 ప్రాంతంలో అస్థికల కలశంతో ప్రదర్శన మొదలు పెట్టారు. ఈ ప్రదర్శన గాంధీ బొమ్మ చేరే సరికి మంత్రి రమేష్ రెడ్డి వర్గీయులు కూడా ప్రదర్శనకు సమాయత్త మయ్యారు. పోలీసులు ఒక వలయంగా ఏర్పడి ప్రసన్న ప్రదర్శనను, ట్రంకురోడ్డు మీదుగా, ఎసి బొమ్మల మీదుగా త్వర త్వరగా నర్తకి సెంటర్, కనక మహల్, బోసు బొమ్మ సాగి

## నెల్లూరు సంగతులు

పొమ్మని సలహా యిచ్చారు. మంత్రి రమేష్ రెడ్డి ప్రదర్శనను [illegible] రంగ నాయకుల పేట మీదుగా వెళ్లమన్నారు. అయితే మంత్రి అనుచరుడు వై.వి. రామిరెడ్డి తాము కూడా మెయిన్ రోడ్డు మీదుగా పోతామని పోలీసులతో ఘర్షణ పడ్డారు. చేసేదేమీ లేక పిబి వీరారెడ్డి ప్రసన్నతో మాట్లాడి వారి ప్రదర్శన త్వరగా ముందుకు కదిలేలా చేసారు. ప్రసన్న, పి.టి. రంగ రాజన్ ఎన్టీఆర్ అస్థికల కలశాన్ని నెత్తిన పెట్టుకోగా; ఎన్టీఆర్ వీరాభిమానియైన మంత్రి రమేష్ రెడ్డి వ్యానులో కలశం పెట్టిన ప్రక్కనే నిలబడ్డారు. ప్రసన్నతో పాటు ఆయన పెద తండ్రి చంద్ర శేఖర రెడ్డి, రాపుల అంకయ్య గౌడ్ తమ వర్గం ప్రదర్శనకు నాయకత్వం వహించారు. మంత్రి రమేష్ రెడ్డితో సర్వేపల్లి చంద్ర మోహన రెడ్డి, రాపూరు ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి, తేగా నారసింహా రెడ్డి తరలి వచ్చారు.

### జడ్పీ సమావేశం

జిల్లాలోని మంత్రులకు, ఎమ్మెల్యేలకు, ఎమ్పీలకు జిల్లా అభివృద్ధి పట్ల ఏ మాత్రం శ్రద్ధ లేదని మరోసారి వెల్లడయ్యింది. జిల్లా అంతటా వర్షాభావ పరిస్థితులు ఏర్పడి పలు ప్రాంతాల్లో పంట ఎండి పోతున్న తరుణంలో ఏర్పాటు చేసిన జడ్పీ సమావేశానికి విచ్చేసి, సమస్య చర్చించి పరిష్కార మార్గాలు సూచించాల్సిన బాధ్యతను వారు మరచి పోయారు. 31 తేది జరిగిన జడ్పీ సమావేశానికి ఒక్క ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి మినహాయించి మరే ఎమ్మెల్యే హాజరు కాలేదు. జిల్లా పరిషత్ అధ్యక్షురాలు డాక్టర్ నాగ

కొరవ 10 పేజిలో

## సణుగుడు

* కోట వృద్ధ సింహం దీన స్థితి!
* నెల్లూరుస్మగ్లింగ్ విస్కీ సిఎం సోదరుడి సొంత సరుకా?

ఆనం సంజీవ రెడ్డి, నల్లపరెడ్డి చంద్ర శేఖర రెడ్డి వంటి వెనుకటి తరం జిల్లా నాయకులను చూసి నప్పుడల్లా వారు జూలు వ్రేలాడ బడిపోయి, డొక్క లెండిన వృద్ధ సింహాలు జ్ఞప్తికి వస్తుంటాయి; సున్నం కొట్టే వారు కూడా లేక కళా విహీనమైన శిథిల రాజ ప్రాసాదాలు స్ఫురణకు వస్తుంటాయి. నవనవ లాడే లేత కాయల ప్రక్కన, తోటమాలి మిస్ చేసి, కోయకుండా వదిలేసిన ముదురు కాయల వలె కొత్త రాజకీయాలలో వీరు పాత ముఖాలతో కాపురాలు చేస్తున్నారు. వెనుకటి తరానికి చెందినందు వల్ల, ఆ "వెనుకటి గుణాలు" (పాపం శమించు గాక! నా వుద్దేశం శతక పద్యపు అర్థం కానే కాదు, నన్ను నమ్మండి!) మానలేక, వెనుకటి వ్యక్తిత్వం వీడలేక కొత్త ఇంట్లో యాంటిక్ ఫర్నిచర్ మాదిరి; గోడ మీద క్రిందటి సంవత్సరం క్యాలండర్ మాదిరి; కసాయి వాడికి తోలను ఇచ్చగించక కొట్టంలో ఒక మూల కట్టివేసి వుంచిన ఒట్టి పోయిన గొడ్డు మాదిరి; నల్లటి జుట్టు మధ్యలో ఫలిత కేశం మాదిరి గతించిన వైభవపు జాడలతో విలక్షణంగా కన్పిస్తుంటారు వారు. జూలు నెరసి తెల్ల బడినా, డొక్కలెండి చిక్కి పోయినా సింహం సింహమే; జీర్ణ తృణంబు మేయడం దాని తత్వానికి విరుద్ధం; ఓపిక తగ్గినా గర్జన తప్ప గాండ్రింపు దాని లక్షణం కాదు. కాని వీరి పరిస్థితి తద్విరుద్ధం; గాండ్రింపు. మ్యావ్. మ్యావ్‌లకూ అప్పుడప్పుడూ సిద్ధమే! ఎప్పటి కెయ్యది ప్రస్తుతమో, అప్పటి కావేషం ధరించి తాము రాజకీయంగా సజీవులమేనని చాటు కొంటుంటారు; పిల్ల కుంకలతోనూ సహ జీవనం చేస్తుంటారు. ఏమి చేస్తారు పాపం- రుచి మరిగిన జిహ్వ. తిరగ

### డోలేంద్ర

మరిగిన కాళ్లు కుదురుగా వుండలేవు గదా?

మొన్న 30 తేది రాత్రి, భరత వర్షే, భరత ఖండే, జంబూద్వీపే పెన్న స్వర్ణముఖి మధ్య ప్రదేశే, శ్రీ యువ నామ సంవత్సర మాఘమాసే, దశమి శుభ నక్షత్రే, కోట గ్రామ నడిమి స్థలే, స్వగృహా వరణ సింహ ద్వారముఖే, సాయంకాల సమయే శ్రీశ్రీశ్రీ చంద్ర శేఖర రెడ్డి వర్యుల అష్టాదశ రూప, శత విచిత్ర ముఖ కవళికల సందర్శన భాగ్యం కల్గింది నాకు. మసక మసక చీకట్లో ఇంట్లోకి బయటికి; బయటికి ఇంట్లోకి;

కొరవ 7 పేజీలో

# కోట, వాకాడు ఒకటయ్యే కల నిజమౌనా?

తూర్పు పడమర ఒకటి కావడం ఎంత నిజమో; జిల్లా రాజకీయాల్లో కోట, వాకాడులు ఒక దగ్గర కలవటం అంతే నిజం. రైలు పట్టాల వంటి ఈ రాజకీయ శక్తులు సమాంతర ప్రయాణం మాని, ఒక చోట కలిశాయని చెప్తే నమ్మడం కష్టం; అటువంటి కల కూడా రాదు. కాని మొన్న 30 తేది మునిమాపు వేళ ఆ కల నిజమైంది. నల్లపరెడ్డి నేతృత్వంలో నేదురుమల్లికి కోట గ్రామం నడిచొచ్చిన జన సత్కారం జరిగింది. ఎంతో అరుదైన, అద్భుతమైన ఈ దృశ్యం వీక్షించ దానికి జనం ఎగబడి వచ్చారు; తాము చూస్తున్నది కల కాదు

**కోట వీధుల్లో నల్లపరెడ్డి నేతృత్వంలో నేదురుమల్లికి జనసత్కారం - కల కాదు అచ్చంగా, నిజం!**

నిజమన్న నమ్మకం కలుగక తమను తాము గిల్లుకొని చూసు కొన్నారు. గిచ్చుకొంటే నొప్పెసింది కాబట్టి అది నిజంగా నిజమే!

శ్రీ నల్లపరెడ్డి జగన్మోహన రెడ్డి, నల్లపరెడ్డి కుటుంబంలో ఎప్పుడూ జరగని, ఎవరూ వూహించని ఈ వింతను ప్రదర్శించారు. పెద తండ్రి మీద అలిగి, పిన తండ్రి కుమారుడి పై కినుకతో అయిన చాలా కాలం క్రితమే కాంగ్రెస్ తీర్థం స్వీకరించారు. కాని అప్పటి వరకు కోటకు సంబంధించి ఆ మార్పులు కుటుంబ కలహం వలె, అంతఃపుర సమరం వలె వుండేవి. మొదటి సారిగా ఆ తెర తొలగి పోయింది. వాకాడు నుంచి కోట దాటుకొని విదుగుమల్లి గ్రామంలో ఒక చిన్న సభకు హాజరయ్యేందుకు వెళ్ల నుండిన జనార్దన రెడ్డిని, కోటలో సత్కరించి సాగ నంపారు జగన్మోహన రెడ్డి. చిల్ల రోడ్డు నుంచి జనం మధ్య నడిపించి; గ్రామం మధ్యలో వూరేగించి, తన ఇంట అల్పాహార విందు చేసి, ఘనంగా స్వాగతించి, గౌరవంగా వీడ్కోలు పల్కాడు. పాతికేళ్ల ఎవతల నల్లపరెడ్డి, నేదురుమల్లి కుటుంబ సభ్యులు ఒకే వేదిక పై నుంచి మాట్లాడటం ఇదే ప్రథమం. ఎన్ని పదవులు వచ్చి, పోయినా కోటలో జనార్దన రెడ్డికి ఈ మాత్రం సత్కారం జరగడమూ ఇదే ప్రథమం. జగన్మోహన రెడ్డి ఆ విషయమే ప్రస్తావించి - ఈ కలయిక తాత్కాలికం కాకూడదని; తానే కాక, తన ఇంట్లోని మిగతా పెద్దలు కూడా జనార్దన రెడ్డితో కలిసి పోయి కోట వాకాడుల స్నేహం పెంచాలని, ఈ గ్రామాల అభివృద్ధికి కలిసి కృషి చేయాలని కోరారు. ప్రక్క ఇంట్లోనే వుండి ఈ పలుకులు వింటుండిన చంద్రశేఖర రెడ్డి గారికి అవి చెవిలో ములుకుల వలె గుచ్చు కున్నట్లున్నాయి.

అప్పటి కప్పుడు అనుకొని, ప్రచారం, ప్రయత్నం లేకుండా ఏర్పాటు చేసిన కార్యక్రమమే అయినా కోట గ్రామస్తులు విశేషంగా హాజరైనారు. ఈ చిన్న సభలో జనార్దన రెడ్డితో పాటు ఆనం సంజీవ రెడ్డి, ఎవల సెంచలయ్య, నేదురుమల్లి వెంకట కృష్ణారెడ్డి తదితరులు కూడా పాల్గొన్నారు.

విదుగుమల్లి గ్రామం కూడా ఒక రకంగా నల్లపరెడ్ల కోటలో భాగమే. కాని అక్కడా జనార్దన రెడ్డికి మంచి స్వాగతం లభించింది. హరిజన వాడలో [illegible] స్వామి గుడికి [illegible] - ప్రతి ఇంటి ముందూ ముగ్గులతో స్వాగత నినాదాలు వ్రాసి గౌరవించారు వారు; గిరిజన వాడలో ఎప్పు సర్పంచాయుడు

## జిల్లావార్తలు

చౌదరి పార్లమెంటరీ నిధి కోటా నుంచి లక్ష ఖర్చుతో నిర్మించనున్న మంచి నీటి పథకానికి శంకు స్థాపించారు. సభ మాత్రం గ్రామంలో జరిగింది. ఇక్కడ శ్రీమతి రాజ్యలక్ష్మి కూడా మాట్లాడారు.

వల్లప గ్రానైట్ అధినేత శ్రీ. కొడవలూరు సుబ్బారెడ్డికి ఈ అన్ని కార్యక్రమాలలో స్పెషల్ ప్రయారిటీ ఇవ్వడం గమనార్హం. జిల్లా రాజకీయాలలో మరొక సంపన్నుడి ప్రవేశానికి ఇది ఆరంగేట్రం అనుకోవచ్చునేమో!

సిరిగ్గల వారి రాజకీయ ప్రవేశాను భవాలతో జనార్దన రెడ్డికి ఇప్పటికే చాలా బొప్పెలు కట్టి వున్నాయి. భవిష్యత్‌లో మరొక బొప్పికి ఇప్పటి నుంచి తన తల పై కాసింత చోటు రిజర్వు చేసి పెట్టు [illegible] వుంటుందా? లేక చెలిమి వరకే ఈ ప్రవేశం పరిమిత మౌతుందా? చూద్దాం!

### ఆత్మకూరులో ఆక్రమణల తొలగింపు

ఆత్మకూరు పంచాయితీ బస్టాండు నుంచి సోమశిల రోడ్డు వరకు గల ఆక్రమణలు తొలగిం చేందుకు పంచాయితీ నడుం కట్టింది. దీని కోసం 31 తేది పంచాయితీ జరిపిన అత్యవసర సమావేశంలో ఆక్రమణల తొలగింపును సభ్యులందరూ ఏకగ్రీవంగా ఆమోదించారు. పంచాయితీ బస్టాండులో ఆక్రమణల వల్ల తమ డిపో బస్సులు రాను, పోను కష్టంగా తయారవ్వడం వల్ల వాటిని అక్కడ వరకు పంపలేమని ఆర్టీసి డిఎం రూప్‌సింగ్ పంచాయితీ దృష్టికి తీసుకెళ్లారు. పది రోజుల పాటు బస్టాండుకు బస్సుల రాక పోకలు నిలిపి వేయడంతో చుట్టు ప్రక్కల గ్రామాల ప్రజలు దూరంగా వున్న ఆర్టీసి బస్టాండుకు వెళ్లేందుకు నానా కష్టాలు పడ్డారు. చివరికి ఉప సర్పంచ్ రవి కుమార్ రెడ్డి డిఎంను ప్రత్యేకంగా కలిసి ప్రస్తుతం వున్న ఆక్రమణలు తొలగిస్తామన్న హామీ ఇవ్వడంతో రెండు రోజులుగా పాత బస్టాండుకు కొన్ని సర్వీసులు మాత్రమే వస్తున్నాయి. మొత్తానికి ఆర్టీసి డిఎం మొండి వైఖరి వల్ల ఆత్మకూరులో ఆక్రమణలు తొలగింప బడటం వాస మనవచ్చు.

### బుచ్చి కళాశాల వార్షికోత్సవం

బుచ్చిరెడ్డిపాళెంలోని గుత్తి కొండ శ్రీరాములు ఆర్ట్స్ అండ్ సైన్స్ డిగ్రీ కళాశాల వార్షికోత్సవ సభ 27 తేది ఘనంగా జరిగింది. సభలో కళాశాల కరస్పాండెంట్ బెజవాడ ఓబుల రెడ్డి మాట్లాడుతూ దాతలు ఎంతో పెద్ద మనసుతో ఇచ్చే విరాళాలను బ్యాంకులో వేసి దాని ద్వారా వచ్చే వడ్డీతో ప్రతిభా వంతులైన విద్యార్థులకు స్కాలర్ షిప్పులు ఇవ్వనున్నట్లు చెప్పారు. కళాశాల భవన నిర్మాణం రామచంద్రా పురం వద్ద జరుగు తుందని, అది పూర్తి అయిన తరువాత కళాశాలను అక్కడకు మారుస్తా మన్నారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన కావలి ఆర్డీవో రఘునందన రావు యూనివర్సిటీ పరిధిలో రెండవ ర్యాంకు సాధించిన విద్యార్థిని కిరణ్మయికి బంగారు పతకాన్ని అందించారు. అదే విధంగా ప్రతిభ కనపర్చిన ముగ్గురు విద్యార్థులకు జ్ఞాపికలను అందజేసి, వారు కట్టిన కాలేజి ఫీజులను తిరిగి ఇచ్చి వేశారు. విద్యావేత్త ఎస్.వి. సీతారామ శర్మ, కాలేజి నిర్వాహక బృంద సభ్యులు దేవిపత్రి వెంకయ్య, పాముంటుల సుబ్బారెడ్డి, మేనకూరు బాలకృష్ణా రెడ్డి తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు

### పార్టీలో భవిష్యత్తు ఇక కార్యకర్తలదే!

సర్వేపల్లి నియోజక వర్గ కాంగ్రెస్ కార్యకర్తల శిక్షణా శిబిరం పిసిసి సభ్యుడు కోటంరెడ్డి శ్రీధర్ రెడ్డి ఆధ్వర్యంలో 28 తేది ముత్తుకూరులో జరిగింది. డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి శిబిరాన్ని ప్రారంభించి మాట్లాడారు. ఈ శిబిరాన్ని ఆదర్శంగా

కొన 7 పేజీల

# కావలి కౌన్సిలర్‌ను మీటింగ్‌లోనే పడేసి కొట్టారు!

కావలి మునిసిపాలిటీ అభివృద్ధి విషయమై కౌన్సిల్‌లోని అధికార పక్షం, చంద్రబాబు వర్గీయుడైన తెలుగు దేశం కౌన్సిలర్ల మధ్య జరిగిన వాదోప వాదాలు పెచ్చు పెరిగి, ఒకరి నొకరు కలియబడి కొట్టుకొనే వరకు వెళ్లాయి. 30 తేది జరిగిన మునిసిపల్ సమావేశంలో ప్రజల వద్దకు పాలన కార్యక్రమానికి మంజూరైన పనులు, నిధుల విషయమై చర్చ జరుగు తుండింది. వైస్ ఛైర్మన్ గ్రంధి యానాది శెట్టి చర్చలో పాల్గొంటూ వచ్చిన అర్జీలలోని పనులు చేపట్టేందుకు 5 కోట్ల రూపాయల అంచనాలు వేసి ప్రభుత్వానికి సమర్పించాయని, కాని కేవలం 5 లక్షల రూపాయలే మంజూరు చేసారని ఆరోపించారు. ఈ ఆరోపణను కౌన్సిల్‌లో చంద్రబాబు వర్గం ఏకైక కౌన్సిలర్ ఆవుల వెంకట రత్నం ఖండిస్తూ, ప్రభుత్వ సహాయానికి మునిసి పాలిటీ ఎటువంటి ప్రయత్నమూ చేయలేదని చెప్పారు. తాను మాట్లాడిన తరువాత విషయం వివరించమని వైస్ ఛైర్మన గ్రంధి యానాది శెట్టి చెప్పడం.

వెంకట రత్నం కూర్చోక పోవడంతో గలాభా మొదలయ్యింది. తమ నాయకుడికి అడ్డు తగిలాడన్న ఉక్రోషం పటలేక కాంగ్రెస్ కౌన్సిలర్లు పి. వెంకటేశ్వర్లు, తోట శ్రీహరి ఆగ్రహంతో వెంకట రత్నం పైకి దూసుకెళ్లి, మెడ వంచి వీపు పై బాదారు. కౌన్సిల్‌లో ఇతర సభ్యులు జోక్యం చేసుకొని ఈ తగాదాను విలువ రించారు. కాంగ్రెస్ సభ్యుల మూకుమ్మడి దాడి నిరసిస్తూ వెంకట రత్నం సమావేశం హాలు నుంచి వాకౌట్ చేసారు. వెంకట రత్నానికి మద్దతుగా ఏ ఒక్క కౌన్సిలరూ మాట్లాడ లేదు.

**ఆహా - ఎంతటి సంస్కార వంతులను ఎన్నుకొన్నారండీ?**

కౌన్సిల్ సమావేశంలో తమ పై జరిగిన దాడి పై వెంకట రత్నం కాంగ్రెస్ కౌన్సిలర్లు తోట శ్రీహరి, పి. వెంకటేశ్వర్లు, వైస్ ఛైర్మన్ గ్రంధి యానాది శెట్టిల పై పోలీసుకు ఫిర్యాదు చేశారు. పట్టణంలో ఈ విషయమై గొడవలు జరుగు తాయని ముందు జాగ్రత్తగా 144 సెక్షన్‌ను విధించారు.

### కావలిలో కిసాన్‌మేళ

కావలి వ్యవసాయ పరిశోధనా కేంద్రం, వ్యవసాయ శాఖ సంయుక్త ఆధ్వర్యంలో ఫిబ్రవరి 13, 14 తేదిల్లో కావలిలో కిసాన్ మేళ నిర్వహిస్తున్నారు. అడవుల పెంపకం, వ్యవసాయ, బీడు భూములకు అనువైన పంటలు వంటి అంశాల పై ఎగ్జిబిషన్ నిర్వహిస్తున్నట్లు పరిశోధనా సంస్థ అగ్రానమిస్టు డాక్టర్ ఆర్. సుధాకర్ రావు చెప్పారు. వరి, వేరుశెనగ, ఇతర పంటలు, రొయ్యలు, చేపల పెంపకం పై రైతులకు వచ్చే సందేహాలను శాస్త్ర వేత్తలు తీరుస్తారట. రైతులు తమ వ్యవసాయ దిగుబడులు ప్రదర్శించి బహుమతులు పొందవచ్చు. సదస్సులో ఆంధ్ర ప్రదేశ్ వ్యవసాయ విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షులు డాక్టర్ ఎం.వి. రావు, విస్తరణ డైరక్టర్ డాక్టర్ కె. జయరామి రెడ్డి, వ్యవసాయ విశ్వ విద్యాలయం రీసెర్చ్ డైరక్టర్ డాక్టర్ ఎన్. చంద్ర శేఖర రెడ్డి, ఎమ్మెల్యే యానాది రెడ్డి పాల్గొంటారు. రైతులు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసు కోవాలని నిర్వాహకులు కోరుతున్నారు.

# నెల్లూరు నలుచెరగుల్లో
## విహంగవీక్షణం

### జీయర్‌స్వామి

శ్రీ త్రిదండి శ్రీరామానుజ చిన్నజీయర్ స్వామి 1 తేది రాత్రి వాకాడు వచ్చారు. అక్కడ నూతనంగా నిర్మించిన శ్రీ రంగనాథ స్వామి దేవాలయ గాలి గోపురానికి సంప్రోక్షణ నిర్వహిస్తున్నారు. ఈ రోజు (2 తేది) సాయంత్రం తిరిగి వెళ్తారు.

### జనార్దనరెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు, మాజీ ముఖ్య మంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి 30 తేది వాకాడు వచ్చారు. ఆ రోజు కోటలో సత్కారం అందుకున్నారు; 31 తేది కంప సముద్రంలో మాజీ సమితి అధ్యక్షుడు శ్రీ ఎం.వి. నారాయణ రెడ్డి సంతాప సభలో పాల్గొన్నారు; రేపు (3 తేది) హైదరాబాదుకు వెళ్తున్నారు; తిరిగి 5 తేది ఉదయం నెల్లూరు వస్తారు.

### మురళీ మనోహర్ జోషి

బిజెపి మాజీ అధ్యక్షుడు శ్రీ మురళీ మనోహర్ జోషి 4 తేది నెల్లూరు వస్తున్నారు. వెంకయ్య నాయుడు గారి కుమార్తె వివాహ రిసెప్షన్ ఎందుకో అటెండెన్స్ అసలు పర్యటన నోద్దేశ్యం; నవీలో వనిగా సర్వోదయ కాలేజి ఆవరణంలో కార్యకర్తల సదస్సులో మాట్లాడుతారు.

### రమేష్‌రెడ్డి
### పిఏ రాసలీల

మార్కెటింగ్ మంత్రి శ్రీ టి. రమేష్ రెడ్డి పిఏ డాక్టర్ ఆంజనేయులు ఎవరకు రమేష్ రెడ్డి పదవికొ ఎసరు పెట్టేటట్లున్నాడు. మంత్రి దగ్గర తనకున్న ఆ చనువును దుర్వినియోగం చేసుకొని తాను కటకటాల పాలు కావడమే కాదు - మంత్రిని కష్టాల్లో పెట్టేలాడు.

డాక్టర్ ఆంజనేయులు పశు సంవర్థక శాఖలో అసిస్టెంట్ డైరక్టరు. హరికృష్ణతో అతడికేదో బాదరాయణ సంబంధం వుందట. ఆ సిఫార్సుతో రమేష్ రెడ్డి పేషీలో చేరాడు. హరికృష్ణ పేరు చెప్పి మంత్రి మీద సవారీ చేయడం అతడి కలవాటట. అతడిని అదుపు చేయడం రమేష్ రెడ్డికి అలవైనట్లు లేదు. ఆ అతి చనువే ఇప్పుడు కొంప ముంచింది.

రమేష్ రెడ్డి నాలుగైదు రోజుల క్రితం రామారావు గారి అస్తికలు తీసుకొని ఢిల్లీ వెళ్లారు. పిఏ గారికి పనేమీ లేదు. అందుకని మంత్రి ఇంట్లో నుంచి లైటున్న కారు తెప్పించి, ఒక ఆరు స్నేహితు రాలిని వెంట బెట్టుకొని బీదర్ వెళ్లారట. అక్కడ ఒక పారిశ్రామిక సంస్థ అతిథి గృహంలో త్రాగి, తందనా లాడి, కామకేళి విలాసాలను భవించి, తెల్లవారిన తర్వాత హైదరాబాదుకు బయల్దేరాడు. దారిలో మళ్లీ త్రాగాడట. ఆ మత్తులో డ్రైవ్ చేయడంతో కారు ప్రమాదానికి గురైంది. అదృష్టవశాత్తు ప్రాణాలు నిల్చాయి. ప్రమాదం జరిగింది రాష్ట్ర సరిహద్దుల్లో; పోలీసులు వచ్చి మంత్రి కారు చూసి, ఏమి జరిగిందని నివారించబోతే ఆ ప్రముఖుడు సమాధానం చెప్పే స్థితిలో కూడా లేడట. మత్తు అంతగా తలకెక్కి వుంది. కారులో ఇంకా బాటిల్లు వుండినాయి. అతన్ని, అతడి లేడీ ఫ్రెండ్‌ను కటకటాల వెనక్కు నెట్టారు. అయితే ఈ వార్త హైదరాబాదుకు చేరి ఉన్నతాధి కారులకు తెలియడంతో ... పోలీసులను గద్దించి, అంతా నేమేంటని విడిపించారు. కారునూ తెప్పించేశారు.

ఆంజనేయులు తోటి వుండిన మహిళ - వ్యభిచారిణి కాదు - ఒక ప్రభుత్వ శాఖలో పని చేసే ఉద్యోగిని అట. ఆమెకు ప్రమోషన్ ఆశ చూపి, లొంగ దీసుకున్నాడట ఈ నిపుణు.

అసలీ కారు కూడా ప్రభుత్వం సరఫరా చేసే మంత్రి వాహనం కాదు. రమేష్ రెడ్డి జీవితి నుంచి తనకు వచ్చిన కారు వెనక్కు పంపేసి, మార్కెటింగ్ కమిటీకి చెందిన ఒక ఏసి కారుకు లైటు తగిలించి ... నాడట. అది డిపార్ట్ మెంటల్ కారు కావడంతో పెట్రోలు లెక్క కూడా చెప్ప నవసరం లేదు. పిఏ చేసిన ఈ తప్పుడు పని ఇప్పుడు మంత్రి మెడకు పాము చుట్టుకుంది. కాంగ్రెస్ నాయకులు దీన్ని రచ్చ చేసి పాలేశారు; రమేష్ రెడ్డి అక్రమ సారా వ్యాపారం చేస్తున్నాడని ఆరోపించారు. విషయం ముఖ్య మంత్రి దృష్టికి వెళ్లింది. ఆ పిఏను వెంటనే సస్పెండ్ చేశారు.

రమేష్ రెడ్డి ఇప్పుడు ఢిల్లీలో వున్నారు. అక్కడి నుంచి ఆయనొక ప్రకటన చేస్తూ తనకు ఈ అక్రమ సారా తరలింపుకు సంబంధం లేదని, తనకు కనీసం త్రాగుడు వ్యసనం కూడా లేదని, తాను ఎప్పుడైనా త్రాగినట్లు నిరూపించినా అసెంబ్లీ ఎదుట ఉరి పోసుకుంటానని ప్రకటించారు.

మంత్రి సమ్మతి లేకుండా, మంత్రి లేని సమయంలో, మంత్రి కారులో రాష్ట్రం దాటి వెళ్లి, రాసలీలలు జరిపే సాహసం ఆ పిఏకి ఎట్లా వచ్చింది? ఎంత కాలం నుంచి జరుగుతున్నది దుర్మార్గం? తన అనుచరులను, తన వుద్యోగులను కూడా అదుపు చేయలేని అసమర్థత పెరిగి పోతే రమేష్ రెడ్డి ఎంత కాలం రాజకీయాలలో వుంద గల్గుతాడు? ఇకనైనా జాగ్రత్త పడకుంటే ఆయనకు ఎప్పటికైనా ప్రమాదమే.

### బేగా ఎమ్మెల్యే ట్రయల్

రాజ్యసభ సీటు కోసం బేగా నారసింహా రెడ్డి గారు భూమ్యాకాశాలు కదిలించి నంత పెద్ద ప్రయత్నం చేస్తున్నారు. సిఎంను ఏ రూపంలో సంతుష్టిప్తి చేయడానికైనా వెరియ నంటున్నారట. తులా భారానికి సరిపడా "వరహా" సిద్ధం చేశారంటున్నారు.

- లోకసభ ఎన్నిక ద్వారా ఎమ్మెల్యే ట్రయల్ వేస్తే ఖర్చుకు ఖర్చు, పైగా గెలుపు ఓటముల రిస్కు; దానికి తోడు నెల రోజులు ప్రచారంలో వళ్లు అలిసి పోతుంది. ఆ పద్దేటే ఒక పెట్టెలో పెట్టి ఇచ్చేస్తే, కడుపులో చల్ల కదలకుండా పదవి నడిచి ఇంటికి వస్తుంది కదా? అందుకనే అంత గట్టి పట్టు పట్టున్నారాయన.

అయితే ఎమ్మెల్యేలు శ్రీ చంద్ర మోహన రెడ్డి, శ్రీ కొమ్మి లక్ష్మయ్య నాయుడులు బేగాకు రాహు కేతువుల వలె అడ్డు పడుతున్నారు. చంద్రబాబు వారి గ్రహణంలో చిక్కుక పోతాడో, ఈయన వలలో పడతాడో వేచి చూద్దాం!

### యూత్ ఉపాధ్యక్షుడుగా
### సునీల్‌కుమార్ రెడ్డి

రాష్ట్ర యువజన కాంగ్రెస్ ఉపాధ్యక్షుడుగా శ్రీ పి. సునీల్ కుమార్ రెడ్డిని నియమిస్తూ, రాష్ట్ర అధ్యక్షుడు శ్రీ సుధాకర రెడ్డి ఉత్తర్వులు పంపారు. సునీల్ ఇది వరకు జిల్లా యూత్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా వుండినాడు.

రెండు వారాల క్రితం కోటంరెడ్డి శ్రీనివాసులు రెడ్డికి ప్రధాన కార్యదర్శి పదవి వచ్చింది; అది మాగుంట కోటా; ఇప్పటి నియామకం జనార్దన రెడ్డి గారి ప్రీత్యర్థం చేసింది. దీనితో ఆక్కడలో బ్యాలెన్స్ సరిపోయింది.

ఈ యూత్ కాంగ్రెస్ పదవులు రంగరంగ మారిన ప్రహసనాలు; వీరు చేసే పనంటూ ఏది వుండదు. పేరు వెనుక తగిలించు కోవడానికి ఒక తోక అంతే!

### మాననీయ మహిళ
### మరణం

బుచ్చిరెడ్డి పాళెం, శ్రీ అఖిల చంద్రశేఖర రెడ్డి గారి తల్లి శ్రీమతి అఖిల శ్రీదేవమ్మ 20 తేది మరణించారు. మాట ఐదు సంవత్సరాల పరిపూర్ణ జీవితం గడిపిన ధన్య చరితురాలు ఆమె.

వయస్సులోనే కాదు, జీవన విధానంలోనూ మాననీయ మహిళ శ్రీమతి శ్రీదేవమ్మ. స్వాతంత్రోద్యమ సమయంలో గాంధీ గారు బుచ్చికి వచ్చినప్పుడు చూడడానికి వెళ్లి, ఆయన ఉపన్యాసానికి ఉత్తేజితురాలై ఆయన ఉద్యమానికి తోడ్పాటుగా తన చేతి గాజులు బహూ కరించారామె. చిన్న తనం నుంచి ఆమెలో సేవా భావం అధికం. చుట్టు ప్రక్క గ్రామాల నుండి బుచ్చికి వచ్చి చదువుకునే స్కూలు పిల్లలకు తన ఇంటి వద్ద మధ్యాహ్న భోజనం పెట్టేదట. అంటరాని తనం నిర్మూలనకు తన వంతు తోడ్పాటు నందించి, తానూ ఆచరించి చూపిన మహా నీయురాలట. దేవాలయాలు, మసీదులు చాలా వాటికి భూరి విరాళా లిచ్చారు.

ఆ చల్లని తల్లికి మా అశ్రు తర్పణం.

### విద్యాకరరెడ్డి
### దుర్మరణం

ముత్తుకూరు రోడ్డు నాలుగవ మైలు యువ రైతు, మంచి మిత్రుడు శ్రీ పెరుమారెడ్డి విద్యాకర రెడ్డి 27 తేది మద్రాసు అపోలో ఆస్పత్రిలో కన్ను మూశారు. నాలుగు నెలల క్రితం కారు ప్రమాదంలో గాయపడి, కోమాలోకి వెళ్లి, ఆస్పత్రిలోనే వుండినాడు. మృత్యువుతో హోరాహోరి పోరాడి, విఫలుడై, అన్ని నెలల తర్వాత లోకం విడిచి వెళ్లి పోయాడు. ఆయన భార్య ప్రమాదం జరిగిన రోజే, ఆ స్థలంలోనే మరణించింది. వారికి ఒకే ఒక కుమారుడు.

కొరవ 7 పేజీలో

# తారలను బట్టి కాదు- కథను చూస్తున్నారు!

### - కాజోల్ చెప్పిన నిజం

"మెరుపు కలలు" చిత్రంలో నటించిన తాజాగా బొంబాయి నుంచి వచ్చిన కాజోల్ "ఎ.వి.ఎం. సంస్థ నుంచి పిలుపొచ్చింది కదా అని వచ్చాను. సినిమా బాగా ఆడుతుందని గ్యారంటీ ఉండబట్టే. అందులో నా పాత్రను ధరించగల్గే నటీమణులు ఇక్కడ లేరని కాదు. ఆ మాట కొస్తే ఇప్పుడు స్టార్ వేల్యూ అనేది ఎక్కడుందండి? కాలం మారి పోయింది. ప్రేక్షకుల అభిరుచులూ మారి పోయాయి. ఇప్పుడు కథ బాగుందా, మొత్తం మీద సినిమా బాగుందా అని అడిగి తెలుసుకొని మరీ ప్రేక్షకులు థియేటర్‌కు వెళ్తున్నారంతే. ఏఏ స్టార్‌లు ఉన్నారని చూసి వెళ్లడం లేదు. ఆ స్టార్ వేల్యూ రోజులు పోయాయి" అన్నారు కాజోల్. ఆమె అలా చెప్పడంలో ఎంతో సత్యం ఉంది. ఆమె అలనాటి తార తనూజ పుత్రిక. ఆమె నోట్లో ఎప్పుడూ పాన్ పరాగ్ ఉండాల్సిందే. అందుకామె "చైన్ స్మోకర్ లాగా నేను చైన్ పాన్ పరాగ్‌ను. మా అమ్మ చైన్ స్మోకర్ అన్న విషయం చాలా మందికి తెలుసు" అంది.

### "లిటిల్ సోల్జర్స్"

ఎటువంటి కష్టాలొచ్చినా చాకచక్యంగా ఎదుర్కోవచ్చు అని నేటి బాలలకు ధైర్య సాహసాలిచ్చి అనే ఆర్మోక్తిని మారిపోసే చిత్రం అన్నారు వెంకట్ అక్కినేని. ఈయన సమర్పించే లిటిల్ సోల్జర్స్ చిత్రంలో మాస్టర్ ఆదిత్య, బేబీ కావ్య, అనంద్, రమేష్, హీరా, కోట శ్రీనివాస రావు, గిరిబాబు, బ్రహ్మానందం, సుధాకర్, రోహిణీ హట్టంగడి పాత్రధారులు.

### ప్రభాకర రెడ్డి దర్శకత్వంలో "కామ్రేడ్"

కొత్త నీరు వచ్చి పాత నీరు కొట్టుకు పోతుంది. ఈ తరం దర్శకులు, నిర్మాతలు అలనాటి నటుడు డాక్టర్ ఎం. ప్రభాకర రెడ్డిని మరచి పోయారు. ఆయన హైదరాబాద్‌లో ఒక క్లబ్బు నడుపుతూ హాయిగా కాలక్షేపం చేస్తున్నారు. ఇంతలో "కామ్రేడ్" అనే శ్రీకాకుళం హరిజన, గిరిజన పోరాట చిత్రానికి దర్శకత్వం వహించే అవకాశం కలిసి వచ్చింది. "దళితుల పై భూస్వాముల ఆధిక్యత, తెలంగాణా రైతాంగ పోరాటం - ఇత్యాది ఉద్యమాలను, విజయాలను తెలియ జేస్తుంది చిత్రం" అన్నారాయన. ఖమ్మంలో తయారయ్యే ఈ "కామ్రేడ్" చిత్రంలో భానుచందర్, శ్రీకన్య, రాజశ్రీ, బ్రహ్మానందం, నర్రా, పి.ఎల్. నారాయణ, చలపతి రావు తారాగణం. సంగీతం: జె.వి. రాఘవులు.

## సినిమా

# అరవిందస్వామి రౌండ్ నెక్ సెంటిమెంట్!

బొంబాయి ఫేమ్ అరవింద స్వామికి ప్రతి చిత్రంలోనూ రౌండ్ నెక్ టీ షర్ట్‌తో నటించడం అదో సెంటిమెంటట. "అటువంటి టీ షర్ట్ లేకుండా నటించాలంటే చిత్రం బాగా ఆడదేమోనననే ఒక భయం. అదే కాక ఇంకొక బలవత్తరమైన కారణం కూడా ఉంది. ఆ రహస్యం నాలోనే ఉండి పోనివ్వండి సార్!" అంటారు అరవింద స్వామి. ఇటువంటి రహస్యాలు కడుపులో చాలా దాచుకున్నాడు కామోసు - అతనికి ఇటీవల పొట్ట పెరుగుతూన్న సూచనలు కనిపిస్తున్నాయి.

### ఊహలో అహం

ఒక డైరక్టర్‌ను అర్థం పెట్టుకొని నాలుగైదు సినిమాలలో ఛాన్సులు కొట్టేసరికి ఊహలో కాస్త అహం పెరిగిందనే చెప్పాలి. ఎవరైనా ప్రెస్ ఫోటోగ్రాఫర్ ఈమె స్టిల్సు తీశాడంటే చాలు "మీకు ఎంత కాలంగా ఫోటోలు తీసే అనుభవం వుంది? మీ చేతిలో ఉన్నది ఏ కెమరా? జపాన్ తయారీయా లేక అమెరికన్ తయారీయా? ఇప్పుడు

కొరవ 10 పేజీలో

# సన్నబడితే ఎగతాళి- లావైతే తిరస్కారం!

### - రేవతి ఆక్రోశం

నటి రేవతికి ఇటీవల ఒక హిందీ పిక్చర్ వచ్చింది. తాను కాస్త పొట్టిగా ఉంటుంది గనుక హిందీ తారలకు మల్లే సన్నబడడానికి చాలా డయిటింగ్ చేసిందిట. ఇక బొంబాయికి వెళ్తే ప్రతి వారూ "ఏమిటి బాగా సన్నబడి పోయారు, చాలా ఆయాస పడుతున్నట్లు కనిపిస్తున్నారే" అని ఆశ్చర్య పోతున్నారట. "నేను కాస్త ఒళ్ళు చేశానమకోండి ఈమె ఇక హీరోయిన్‌గా పనికి రాదు వేంప్ వేషాలు వేయాల్సిందే అంటారు. వీళ్ళ ధోరణి నాకు అర్థం కాక చస్తున్నా" అన్నది రేవతి.

### మీనా ఆశ

తన తీరని కోరిక ఒకటి మీనా చెప్పింది. "అమితాబ్ బచ్చన్ సరసన ఒక చిత్రంలోనైనా హీరోయిన్‌గా నటించా లనుకున్నాను. నా కోరిక నెరవేరేటట్లు లేదు" అంది "మరి, ఆయన మీకంటే చాలా పొడుగు కదా?" అంటే - "ఏం జయబాధురి నాకన్నా రెండంగుళాలు పొట్టి, ఆమెతో అతను కాపురం చేయడం లేదా? నాతో నటిస్తే ఏం" అంది; "అప్పుడు ఆయన నటించడం పట్ల అంతగా ఆసక్తి చూపిస్తున్నట్లు లేదు కదా" అంటే "అందుకే ఆయనతో నటించాలనే ఆశకు తిలోదకా లిచ్చేశాను" అంది నవ్వుతూ.

నిజమే మరి, అందని ద్రాక్ష...

### ఇందిర స్థానానికి ప్రియాంక అనర్హురాలు

"ఇందిరా గాంధీ గారికి చరిష్మా ఉంది. అది ఆమె మనమరాలు ప్రియాంకకు లేదు" అంటూ హాస్య నటుడు నాగేష్ అందుకు కారణం కూడా చెప్పారు. సుహాసిని తమిళంలో రూపొందించిన "ఇందిర" చిత్రం ఓ మోస్తరుగా ఆడిందట; ఆ చిత్రాన్నే హిందీలో "ప్రియాంక"గా డబ్ చేస్తే అడ్రసు లేకుండా పోయిందట.

### విజయశాంతి భక్తి

ఇటీవల విజయ శాంతికి దైవ భక్తి కాస్త ఎక్కువైంది. ఆమె పూజ గదిలో దేవతల పటాలు అనేకం ఉన్నాయి. ఆ గదిలో రెండు గంటలకు తక్కువ కాకుండా గడుపు తుందట. అందుకే ఉదయం ఎనిమిది గంటలకు ఎవరైనా షూటింగ్ ఏర్పాటు చేస్తే, పది గంటలకు కాని తాను హాజరు కాలేనని చెప్పేస్తుంది. పండుగ రోజుల్లో ఉపవాసం కూడా ఉంటుందట "నా భక్తి నేడు నన్ను రక్షిస్తోంది దేవతల కటాక్షం వల్లనే ఇంత వరకు ఎదగ గలిగాను" అంటుందామె.



రిపబ్లిక్ డే ఉత్సవంలో కలెక్టర్ డి. సాంబశివ రావు, యస్.పి. పూర్ణచంద్ర రావు.

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

భూమమ్మ స్థలం ఫిరాయించిన మూలంగా ముఖం చెల్లక సమావేశానికి వచ్చినట్లు లేదు. అందువల్ల అధ్యక్ష స్థానంలో కూర్చొన్న ఉపాధ్యక్షుడు మల్లెమాల రాఘవ రెడ్డి బుద్ధ విగ్రహంలా ఆ సీటులో కూర్చొన్నారే తప్ప పెదవి విప్పి ఒక్క మాట మాట్లాడ లేదు. సమావేశం హాలులో తక్కువ ఫ్యాన్లు వుండడం, ఎసి పని చేయక పోవడంతో చెమటతో తడిచి ముద్దయిన కొత్త కలెక్టర్ డాక్టర్ సాంబ శివరావు వెంటనే ఎసి పరికరాలు రిపేరు చేయమని సిఇఓను ఆదేశించారు. వచ్చిన కొద్దిపాటి సభ్యుల్లో కాంగ్రెసు సభ్యులు ఉత్సాహవంతంగా పలు సమస్యల పై అధికారులను నిలదీశారు. ఇరిగేషన్, ఆర్టీసి అధికారుల తీరు పై పలువురు ప్రశ్నల వర్షం కురిపించే సరికి అధికారులు నిశ్చేష్టు లయ్యారు. ఆత్మకూరు నీటి పారుదల శాఖాధికారులు నీటిని అమ్ము కొంటున్న విషయమై జడ్పిటిసి సభ్యుడు సుబ్బారెడ్డి సంబంధిత అధికారిని నిలదీయగా, తాను అటువంటి పని చేయలేదంటూ దేవుడి సాక్షిగా, ఆత్మ సాక్షిగా సభలో ప్రమాణం చేసారా అధికారి. సంగం, నెల్లూరు ఆన కట్టల వద్ద మంత్రి రమేష్ రెడ్డి ప్రోద్బలంతో ఏడు లక్షల రూపాయల విలువ చేసే ఇసుక బస్తాలు

వేయ వలసిన అవసరం ఏమొచ్చిందని నెల్లూరు రూరల్ టిసి సభ్యుడు హంస కుమార్ రెడ్డి నిలదీశారు. సంబంధిత అధికారులు సభలో లేనందువల్ల వచ్చే సమావేశంలో వివరణ ఇప్పిస్తానని సిఇఓ బ్రహ్మేంద్ర రావు సభ్యుడికి హామీ ఇచ్చారు. జిల్లాలో ప్రజల అవసరాలు తీర్చుడు 2 వేల ఆర్టీసి బస్సులు అవసరం కాగా, ఆర్టీసి వున్నతాధికారులు కేవలం 500 బస్సులు మాత్రమే నడపడమేమిటని అనుమ సముద్రం పేట జడ్పిటిసి సభ్యుడు నిలదీశారు. జిల్లాలో తగినన్ని బస్సులు లేని విషయాన్ని ఆర్టీవో కూడా అంగీకరించి తన వద్ద వివిధ రూటులలో బస్సులు తిప్పేందుకు కేవలం 300 దరఖాస్తులు మాత్రమే ప్రస్తుతం పెండింగులో వున్నట్లు వివరించారు. జిల్లాను కరువు ప్రాంతంగా ప్రకటించాలని డిమాండ్ చేస్తూ జడ్పిటిసి సభ్యుడు మురళీధర్ ప్రవేశ పెట్టిన తీర్మానాన్ని సభ ఆమోదించింది. ఎన్టీఆర్, మాగుంట సుబ్బరామ రెడ్డి, ఎమ్మెల్యే నారాయణ రెడ్డి జడ్పిటిసి సభ్యుడు ప్రసాద్ ల మరణానికి సంతాప సూచకంగా సభ రెండు నిమిషాలు మౌనం పాటించింది.

## నెల్లూరులో ఎన్టీఆర్ విగ్రహం

రాష్ట్ర మార్కెటింగ్ శాఖా మంత్రి శ్రీ టి. రమేష్ రెడ్డి, నర్తకి థియేటర్ ఎదురుగా దివంగత ఎన్టీ రామారావు శిలా విగ్రహ స్థాపన కోసం మునిసిపల్ అనుమతి కోరుతూ పెట్టిన తీర్మానాన్ని కౌన్సిల్ ఆమోదించింది. 29 తేది సాయంత్రం ఛైర్మన్ శ్రీ ఆనం వివేకానంద రెడ్డి అధ్యక్షతన మునిసిపల్ సమావేశం జరిగింది. కౌన్సిల్ సభ్యులకు అంద జేసిన అజెండాలో ఎన్టీఆర్ విగ్రహాన్ని ఆర్.ఆర్. వీధిలోని నిర్మలా రెస్టారెంటుకు ఎదురుగా ఏర్పాటు చేయాలని కోరు తున్నట్లుగా వుంది. కాని ఈ చోటులోనే రాజీవ్ గాంధీ విగ్రహ స్థాపనకు ఇంతకు మునుపు అనుమతిచ్చి వుందని, మర్లి అక్కడ ఎన్టీఆర్ విగ్రహమేమిటని పలువురు సభ్యులు ఛైర్మన్‌ను ప్రశ్నించారు. సమావేశానికి ముందే ఈ విగ్రహాల స్థాపన విషయమై ఇరు వర్గాల నాయకులతో తన ఛాంబర్‌లో మాట్లాడి ఒప్పించినట్లు ఛైర్మన్ చెప్పారు. ఈ చర్చల్లో నిర్మలా రెస్టారెంటు ఎదురుగా రాజీవ్ గాంధీ విగ్రహం, నర్తకి థియేటర్ ఎదుట ఎన్టీఆర్ విగ్రహం ఏర్పాటు చేసు కొంటారని వివేకానంద రెడ్డి వివరించి చెప్పారు. దీనితో విగ్రహాల విషయమై వీరావేశాలు ప్రదర్శించను వచ్చిన పలువురు కౌన్సిలర్లు చల్లబడి పోయారు. సిమా సెంటర్ ప్రాంతాన్ని ఎన్టీఆర్ గేటుగా అభివృద్ధి పర్చేందుకు కౌన్సిల్ మరో తీర్మానాన్ని ఆమోదించింది. ఎన్టీఆర్ కుటుంబ సభ్యులకు సానుభూతి తెలిపే తీర్మానాన్ని మునిసిపల్ వైస్ ఛైర్మన్ వి. దశరథ రామయ్య ప్రవేశ పెట్టగా కోట లక్ష్మి కుమారి బలపరిచారు. ఎన్టీఆర్ వ్యక్తిగత జీవితం పై మాట్లాడను ప్రయత్నించిన పిండి సురేష్‌ను మహిళా కౌన్సిలర్లు ఎం. అరుణ కుమారి, సరోజనమ్మ నిలువ రించారు. కోట లక్ష్మి కుమారి ఎన్టీఆర్ గుర్చి మాట్లాడుతూ కన్నీళ్లను ఆపుకోలేక పోయారు.

## ఎసి స్టేడియంలో మద్యం దగ్ధం!

సంపూర్ణ మద్య నిషేధం అమలులోకి వచ్చిన తరువాత ఎక్సైజ్ అధికారులు స్వాధీనం చేసుకొన్న 30 లక్షలు విలువ చేసే మద్యాన్ని 26 తేది ఎసి స్టేడియంలో దగ్ధం చేశారు. గూడూరు, సూళ్లూరు పేట, ఉదయ గిరి, కోవూరు, ఆత్మకూరు, కావలి, రాపూరు, వెంకటగిరి ఎక్సైజ్ స్టేషన్ల పరిధిలో స్వాధీనం చేసుకొన్న ఈ మద్యం విలువ 30 లక్షలు చేస్తుందని ఎక్సైజ్ ఎసి దివాకర్ విలేఖరులకు చెప్పారు. పోలీసు శాఖ పట్టుకొన్న 10 లక్షల విలువైన మద్యాన్ని కూడా ఐక్యత జత కలిపి దగ్ధం చేశారు. మంత్రి రమేష్ రెడ్డి, జిల్లా కలెక్టర్ డాక్టర్ డి. సాంబశివ రావు, ఎస్.పి. పూర్ణ చంద్ర రావు, జిల్లా భద్ది ఎం. అప్పారావు, సర్వేపల్లి శాసన సభ్యుడు సోమిరెడ్డి చంద్ర మోహన రెడ్డి, మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి ఈ మద్య దహనాన్ని వీక్షించారు.

## నెల్లూరు ఆర్టీసిలో బస్ వాషింగ్ ప్లాంట్

నెల్లూరు ఆర్టీసి బస్ స్టేషన్‌లో 10 లక్షల వ్యయం చేసి ఆటో మేటిక్ బస్ వాషింగ్ ప్లాంటును జోనల్ ఎగ్జిక్యూటివ్ డైరక్టర్ టి. ప్రభాకర గుప్త 26 తేది ప్రారంభించారు. ఈ ప్లాంట్ నెలకొల్పడం ద్వారా రోజుకు 500 బస్సులు శుభ్రం చేసే అవకాశం కల్గింది. దీన్ని ఏర్పాటు చేయడం ద్వారా విద్యుత్ ఖర్చుతో పాటు నీటిని కూడా ఆదా చేయవచ్చు. రాష్ట్రంలో హైదరాబాద్, విజయ వాడ, తిరుపతి, విశాఖ పట్నం, కడప బస్ స్టేషలలో మాత్రమే ఇంత వరకు ఇటువంటి ప్లాంట్స్ వున్నాయి. ఈ కార్యక్రమంలో రీజినల్ మేనేజర్ టి. సీతారాం, ట్రాఫిక్ మేనేజర్ బుచ్చి పాపారావు, మెకానికల్ ఇంజనీర్ వేలు, పి.ఆర్.ఒ. దీనదయాళ్ పాల్గొన్నారు.

## శ్రీకృష్ణదేవరాయ జయంతి సభ

నెల్లూరు వర్తమాన సమాజం అధ్వర్యంలో టౌన్ హాల్‌లో 9 తేది శ్రీ కృష్ణ దేవరాయ జయంతి సభ జరుగుతుంది. ఆలిండియా రేడియో విజయ వాడ స్టేషన్ డైరక్టర్ డాక్టర్ రేవూరి అనంత పద్మనాభ రావు ఈ సభకు అధ్యక్షత వహిస్తారు. మద్రాసు విశ్వ విద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు డాక్టర్ వి. రామచంద్ర శ్రీ కృష్ణ దేవరాయలు కవితా వైభవం గుర్చి మాట్లాడి. చల్లగుండ్ల రామ చంద్రయ్య తమ జననీ జనకుల స్మృత్యంకంగా ఇచ్చే సన్మానాన్ని స్వీకరిస్తారు. కవి పండితులు, రంగ స్థల నటులు రాచగుండ్ల చంచలరావును ఈ సందర్భంగా సన్మానిస్తారు. కార్యక్రమానికి సాహిత్య అభిమానులను తరలి రమ్మంటున్నారు. సమాజం అధ్యక్ష, కార్యదర్శులు పి.వి. రమణా రెడ్డి, టి.వి. నరసింహం.

## సేవాభారతి అధ్వర్యంలో అనియత విద్యా కేంద్రాలు

నెల్లూరులోని స్వచ్ఛంద సేవా సంస్థ సేవా భారతి అధ్వర్యంలో రిపబ్లిక్ డే శుభ దినాన జిల్లాలోని 10 ప్రదేశాల్లో అనియత విద్యా కేంద్రాలు ప్రారంభించింది. పొదలకూరు రోడ్డులోని శివాజీ సెంటర్‌లో ఈ కేంద్రాన్ని నెల్లూరు ఆర్టీవో టి.కె. శ్రీదేవి, దర్గామిట్ట గిరిజన కాలనీలో జిల్లా అనియత విద్యా ప్రాజెక్ట్ అధికారి వెలుగొండ రాయలు, పుయ్యాల కాలువ గిరిజన పాళెంలో కేంద్రాన్ని జిల్లా సాక్షరతా సమితి కన్వీనర్ షరీఫ్ ప్రారంభించారు. వసంతోపు గిరిజన కాలనీ, కబాడి పాళెం చెన్నకేశవ నగర్, అరవ వీధి, మూలపేట అరుంధతీయ పాళెం, అల్లూరులోని ఆర్టీఆర్ కాలనీ, అంబాపూరు గిరిజన కాలనీల్లో ఈ కేంద్రాలు ప్రారంభమయ్యాయి. ఈ కార్యక్రమాల్లో సేవా భారతి రీజనల్ పర్యవేక్షకుడు జయ రామరాజా, స్థానిక సంయోజకులు సి.ఎల్. నరసింహా రావు, సహ సంయోజకులు ఎం. నరసింహం పాల్గొన్నారు. తమ సంస్థ తరఫున జిల్లాలో 70 కేంద్రాలను త్వరలో ప్రారంభిస్తున్నట్లు సేవా భారతి నిర్వాహకులు తెలియ జేశారు.

## అన్నదేవుల సావిత్రమ్మ అవార్డు కార్యక్రమం

అన్నదేవుల సావిత్రమ్మ అవార్డు బహూకృతి కార్యక్రమం 4 తేది మూలపేటలోని సరస్వతీ సమాజంలో జరుగుతుంది. నాటక విమర్శకులు నెలటూరు రామదాసు అయ్యంగార్, మేకప్ ఆర్టిస్ట్ షేక్ బాబు, హార్మోనిస్టు పి. ఓబయ్యలకు ఈ యేడాది అవార్డు లిస్తారు.

## డ్రైవర్ల సంఘానికి ఎన్నికలు

జిల్లా ప్రభుత్వ వాహనాల డ్రైవర్ల సంఘం సర్వసభ్య సమావేశం 21 తేది సంఘం కార్యాలయమైన రాజా భవన్‌లో జరిగింది. ఈ సందర్భంగా జరిగిన ఎన్నికల్లో ఎ. అంజిశ్వర రావును జిల్లా అధ్యక్షునిగా, షేక్ కాలేషాను కార్యదర్శిగా, సి. గౌరి ప్రసాద్‌ను కోశాధికారిగా ఎన్నుకొన్నారు. పట్టణ అధ్యక్షునిగా సయ్యద్ మొహిద్దీన్ అబ్దుల్, కార్యదర్శిగా ఎల్. గోవింద రాజులను ఎన్నుకొన్నారు.

## సినిమా

9 పేజీ కొరవ

మీరు తీసిన స్టిల్‌కు ఎంత స్పీడ్ పెట్టారు? కాంతి చాలా? కెమెరాలో ఏ ఫిలిమ్ లోడ్ చేశారు? ఫోటో బాగా వస్తుందన్న నమ్మకం మీకుందా? బాగా ఫోకస్ చేశారా?" అని ప్రశ్నల వర్షం కురిపిస్తూంటే, ఫోటోగ్రాఫర్లు తట్టుకోలేక పోతున్నారు పాపం.

### "కింగ్"

"ఒక జిల్లా కలెక్టరు పేరు మోసిన సంఘ విద్రోహ శక్తుల పై వీరోచితంగా పోరాడి విజయం సాధించడం ఈ చిత్ర కథ" అన్నారు రామాలయం సంస్థ అధినేతలు. మలయాళం నుంచి డబ్ చేయ బడిన ఈ చిత్రంలో మమ్ముట్టి, వాణి విశ్వనాథ్, సురేష్ గోపి అదిగా గలవారు నటించారు. మాటలు, పాటలు: వెన్నెలకంటి. దర్శకత్వం: షాజీ కైలాస్.

### మంచి ఆలోచన

కిరణ్ బేడి వంటి ఆదర్శ పోలీస్ అధికారులను దృష్టిలో పెట్టుకొని రూపొందించే చిత్రంలో లక్ష్మి, విజయ శాంతి, నగ్మా, జయప్రద, సౌందర్య, రోజా, రమ్యకృష్ణ ఇప్పుడు అమని పోలీస్ యూనిఫామ్‌లలో కనిపిస్తున్నారు. దాదాపు ఇదొక ఫాషన్ అయి పోయినట్లుంది. అమనికి మాత్రం ఒక ధైర్యం ఏర్పడిందట. "పెద్ద హీరోల పక్కనే కాకుండా ఇటు పైన చిన్న హీరోల ప్రక్కన కూడా ఖాకీ యూనిఫామ్‌లో దర్పంగా నటించ వచ్చు. ఈ రోలను ఈ పాత్ర డామినేట్ చేయడం తథ్యం. పైగా ఒక పడి తన టాలెంట్‌ను చూపడానికి ఎంతో స్కోప్ ఉంటుంది" అని అమని తన మనసులోని మాటను చెప్పింది.

## 50 ఏళ్ళ క్రితం

3

చిల్లా పిచ్చయ్య ధర్మాన ఆరుబెల్ల కోరా కొంత నష్టంతో ప్రజలకు పంచటానికి పంపితే తమ్మిడి బలహీనంతో పెద్ద రెడ్డి గారి దేవిడి పంచడం విచార కరం కదా!

గత 13 వ తేది కలరా పేపంటు వస్తే తహశీల్దార్ హుకుం అయినా ఆరోగ్య శాఖ శ్రద్ధ వహించక పోయింది. జేను! పాల తీపిలో చేరెందుకు రుచి వస్తుంది లేండి!

### రాపూరు తాలూకా సభ

రాపూరు తాలూకా మహాజన సభ ఫిబ్రవరి 2వ వారంలో గోపాల రెడ్డి గారి అధ్యక్షతను జరుగును. తేది వివరములు ముందు తెలుప బడును.

## నెల్లూరుముచ్చట్లు

### పార్లమెంటరీ బోర్డు

నెల్లూరు జిల్లా శాసన సభ్యుల నిర్ణయ విచారణకు పార్లమెంటరీ బోర్డు వారు 27 తేది నెల్లూరు వచ్చారు ముందు దరఖాస్తులు వేసిన అభ్యర్థులను, తర్వాత వారిని సపోర్టు చేయడానికి వచ్చిన వారిని ముఠాలు ముఠాలుగా విచారించారు. ఓరుగంటి వెంకట సుబ్బయ్య, పొన్నలూరు వీర రాఘవ రెడ్డి, పొణకా కనకమ్మ గారలు తప్ప తక్కిన అందరు తమ తమ వర్గాలను తీసుక వచ్చారు. ఇదంతా చూస్తే నా కళ్ళకు ఫార్సుగా కనిపించింది. బోర్డు వారు కూడా నామకే వాస్తే విచారణ జరిపారు విసుగుతో, 28 తేది ఉదయాన్నే ఏలూరుకు వెళ్ళి పోయినారు. యిప్పుడేమీ వారి అభిప్రాయాలు వెలిబుచ్చ లేదు. 4 తేది బందరులో పట్టాభి రామయ్య గారి సాన్నిధ్యంలో సమావేశమై ఈ జిల్లా ప్రతినిధి ఎ.సి. సుబ్బారెడ్డి గారిని కలుపుకొని ఆలోచించి తీర్మానిస్తారట.

* * *

ఈ విధమైన విచారణ పజాన్ని తెలుపదు. అట్లా గాక ఆయా డివిజన్‌లలో బోర్డు వారనుకొన్న పెద్ద మనుష్యులను, సంస్థలను, విప్లవకులను, బాధ్యత తెలిసి ప్రవర్తించే వ్యక్తులను విచారించడం, అభ్యర్థుల మంచి పెద్దలు, కార్యదక్షత, చేసిన త్యాగము, సమిష్టి ప్రయోజనము, దేశకాల పాత్రలు ఇవన్నీ విచారించి నిర్ణయించు కోవడం బాగుంటుంది. కాని యీ విధంగా ఆయా పక్షీయులు గుంపులు గుంపులుగా రావడం, చెప్పడం ఇదేమీ నాకు నచ్చలేదు బాబు.

ఈ సభలో వెన్నెలకంటి రాఘవయ్య గారి అభ్యర్థిత్వాన్ని ఏకగ్రీవంగా ఆమోదించినట్లు "హిందూ" పత్రిక అంటున్నది. కాని నేను విచారించగా ఆ తీర్మానం సర్దార్ హనుమా రెడ్డి ప్రవేశ పెట్టగానే సభలో పెద్ద గలభా రేగడం, దాన్తో సభను విలిపి వేయడం జరిగిందట. అంతే గాని ఆ తీర్మానం జరగనే లేదట.

-విమర్శకుడు

# పత్తి రైతుకు మళ్ళీ ఆత్మహత్యే శరణ్యమా?

"తెల్ల బంగారం" అని ముద్దుగా పిలుచుకునే పత్తి పంటకు వెతలు తప్పటం లేదు. ఒక ఏడాది చీడ పీడలతో పత్తి రైతు చితికి పోతే మరో ఏడాది భారీ వర్షాలు - ఇంకోసారి ధరలో మాంద్యం. మరోసారి మార్కెటింగ్ సమస్య - ఇలా సమస్యల మీద సమస్యలతో పత్తి రైతు ఉక్కిరి బిక్కిరి అవుతూ కూడా తిరిగి పత్తినే పండించటానికి కారణం తెల్ల బంగారానికి వున్న గ్లామర్. అన్నీ బావుండి రోజులు కలిసొస్తే నాలుగు రాళ్ళు వెనకేసుకోవచ్చన్నది ఒక్క రైతు ఆశ. గత అక్టోబరులో కురిసిన భారీ వర్షాలకు పత్తి పంట బాగా దెబ్బతిని రాబడి గణనీయంగా తగ్గింది. దీనికి తోడు ఈ ఏడాది విద్యుత్ కోత పత్తి రైతు ఆశల్ని నిలువునా కూల్చి వేసింది. 1994 - 95 సీజన్‌లో పత్తి ధర నిలకడగా ఉండటంతో అప్పుడు పత్తి విస్తీర్ణం బాగా పెరిగింది. ముఖ్యంగా రాయలసీమ ప్రాంతంలో వేరుశెనగ, పొద్దు తిరుగుడు పైర్లు సాగు చేసే రైతాంగం కూడా ఈ ఏడాది పత్తి పంట పట్ల ఆకర్షితులు కావటంతో పత్తి విస్తీర్ణం సహజంగానే పెరిగింది. పత్తి పంటకు ప్రధాన కేంద్రాలైన గుంటూరు, కృష్ణ, ప్రకాశం జిల్లాల్లో కూడా పత్తి విస్తీర్ణం పెరిగినట్లు అంచనాలు చెబుతున్నాయి. పత్తి సాగుకు ప్రకృతి అను కూలించి వుంటే అయితే ఈ ఏడాది పత్తి దిగుబడి ఇబ్బడి ముబ్బడిగా పెరిగి ధర ఆకాశాన్నుంచి పాతాళానికి పడిపోయి ఉండేది. అక్టోబరు వర్షాల కారణంగా పత్తి దెబ్బ తినటం వల్ల దిగుబడి తగ్గి ధరలో మార్పు లేకుండా నిలకడగా వుంది. అయితే "దారానా రాబడికి బారానా ఖర్చు" అన్నట్లు రైతు పెట్టిన పెట్టుబడికి వచ్చిన రాబడితో పోల్చుకుంటె పత్తి రైతు పరిస్థితి మళ్లీ మొదటికే. పంట పూర్తిగా దెబ్బ తిన్న రైతులు ఆత్మహత్యలకు పాల్పడు తున్నట్లు అక్కడక్కడా వార్తలు వింటున్నాం. కాస్తో కూస్తో పంట దక్కిన రైతులు కూడా గంపెడు దారిద్ర్యంతో మరింత అప్పుల ఊబిలో కూరుకు పోతున్నారు.

### పత్తి రైతుల సమస్యలు

పత్తి పండించే రైతుకు అన్నీ సమస్యలే - పత్తి విత్తు నాటిన దగ్గర్నుంచి పంట చేతికి వచ్చే వరకు భవిష్యత్తు మీద భారం వేసి గుండెల్ని అరచేత బెట్టుకొని నరాలు తెగే టెన్షన్‌తో కాలం గడపాల్సి వస్తోంది. ఈలోగా చీడపీడలు ముట్టడికి వస్తే పత్తి రైతు ఆశలు ఆరంభంలోనే అడుగంటుతాయి. ఆ పై వర్షాలు కరుణించి పంట చేతికి వచ్చినా - దాన్ని అమ్ము కోవడానికి రైతులు పడుతున్న అవస్థ అంతా ఇంతా కాదు. పంట చేతికి రాగానే రైతు రంగుల కలలు కనే పరిస్థితి లేకుండా పోయింది. అమ్మబోతే అడవి - పండించ బోతే కొరివి అన్నట్లుంది పరిస్థితి.

**అక్టోబరులో అతివృష్టి, ఆ తర్వాత అనావృష్టి; కష్టపడి పండిస్తే కొనేవాడు లేడు, కొన్నా ధర లేదు; తూకాలలో దగా, మార్కెట్ యార్డుల్లో మోసం; విద్యుత్ కోతతో మిల్లులు మూతపడి మరీ మునిగి పోతున్నాడు పత్తి రైతు!**

### పత్తి మార్కెటింగ్ పద్ధతి

రాష్ట్రంలో పత్తి మార్కెటింగ్ ప్రధానంగా వ్యవసాయ మార్కెట్ కమిటీల యార్డుల్లో జరగాల్సి వుండగా కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో మచ్చుకు కూడా అది జరగడం లేదు. ఈ జిల్లాల్లో ఎక్కువ శాతం కాటన్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా వారి ఆధ్వర్యంలో పత్తి కొనుగోళ్ళు జరుగు తున్నాయి. పత్తి నేరుగా జిన్నింగ్ మిల్లులకు తీసుకు వెళ్ళడం అక్కడ ఆనవాయితీ. చిన్న చిన్న బ్రోకర్లు గ్రామాలకు వెళ్ళి పొలాల దగ్గరే కాటాలు పెట్టి పత్తి కొనుగోలు చేస్తుంటారు. అటువంటి చోట బ్రోకర్ చెప్పిన ధరకే రైతు తన పంటను తెగ నమ్ముకోవాలి. అలా కాదని సి.సి.ఐ.కు పంట అమ్ము కోవాలంటే గ్రేడింగ్‌తో వాళ్ళు పెట్టే అగ్నిపరీక్షతో రైతు విలవిల లాడి పోవాల్సి వస్తుంది. బ్రోకర్ల తూకాల మోసాలు పత్తి రైతుకు అదనపు శిక్షగా మారుతున్నాయి. ఇక్కడ తూకాలు పర్యవేక్షించే వ్యవస్థ ఏదీ లేక పోవడంతో అమాయకపు రైతు నష్టపోక తప్పటం లేదు. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర వ్యవసాయ మార్కెటింగ్ చట్టం ప్రకారం ఇలా గ్రామాల్లో ఎక్కడి కక్కడ కాటాలు పెట్టి పత్తి కొనుగోలు చేయడం నేరం. కాని చట్టం నిర్వర్తించాల్సిన విధిని అధికారులు విస్మరించడం వల్ల పత్తి రైతుకు గత్యంతరం లేకుండా పోతోంది. మార్కెట్ చట్టం ప్రకారం వ్యవసాయ మార్కెట్ కమిటీల పరిధిలో యార్డుల్ని అభివృద్ధి చేసి అక్కడే లావాదేవీలు జరిపించి ఖచ్చితమైన తూకాలతో సరైన ధర రైతుకు లభించేలా చూడాల్సిన బాధ్యత మార్కెట్ కమిటీల పై వుంది. కాని ఆచరణలో అలా జరగడం లేదు. తెలంగాణా, రాయలసీమ ప్రాంతాల్లో కొన్ని చోట్ల తప్పితే పత్తి రెగ్యులేషన్ యార్డుల్లో అమ్మకాలు జరగడం లేదు

### మార్కెట్ యార్డుల్లో మోసాలు

కోస్తా ఆంధ్రా ప్రాంతంలో మార్కెట్ యార్డుల్లో రెగ్యులేషన్ లేక పోవడం ఒక సమస్య అయితే తెలంగాణా, రాయలసీమ ప్రాంతాల్లోని మార్కెట్ యార్డులుండి కూడా రైతును దోపిడీకి గురి చేస్తున్నాయి.

తెలంగాణా ప్రాంతంలో ఆదిలాబాద్, వరంగల్ మార్కెట్ యార్డుల్లో పెద్ద మొత్తంలో పత్తి లావా దేవీలు జరుగు తున్నాయి. వరంగల్ మార్కెట్ కమిటీలో "శాంపిల్ - బిడ్" జరిపి గరిష్ట ధర నిర్ణయించడంతో మార్కెట్ కమిటీ పాత్ర ముగుస్తుంది. ఆ తర్వాత వ్యాపారస్తుల గుమస్తాలు రంగంలోకి దిగి వారికి తోచిన ధరతో పత్తిని కొనుగోలు చేస్తుంటారు. మార్కెట్ చట్టం ప్రకారం యార్డుకు వచ్చిన పత్తిని శిక్షితులైన గ్రేడర్ల చేత గ్రేడ్ చేయించి రైతు వరకు వారీగా వేలం ద్వారా గాని, టెండర్ విధానం ద్వారా గాని ధర నిర్ణయం జరపాల్సి వుంటుంది. కానీ ఆచరణలో అలా జరగటం లేదు. వ్యాపారస్తుల గుమాస్తాలే వారికి తోచిన రీతిలో గ్రేడింగ్ చేసుకొని ఇష్టమైన ధరను శాసిస్తుంటారు. యార్డుకు తెచ్చుకున్న సరుకు తిరిగి ఇంటికి పట్టుకెళ్ళ లేక దిక్కు తోచని రైతులు ఇష్టమున్నా లేకున్నా గుమాస్తాలు నిర్ణయించిన ధరకే తెగ నమ్ము కోవాల్సి వస్తోంది. ధర నిర్ణయం అయ్యాక తూకాల్లో హెచ్చులు. యార్డులో పెద్ద పెరిగిన దొంగ తనాలతో రైతులు తెచ్చుకొన్న పత్తిలో 5 నుంచి 10 శాతం దాకా కోల్పోక తప్పదు.

ఆదిలాబాద్ యార్డులో అయితే పత్తి యార్డు నుండి నేరుగా జిన్నింగ్ మిల్లులకు వెళ్ళి అమ్మకాలవుతుంటాయి. యార్డులో వేలం అయిన పత్తి కూడా జిన్నింగ్ మిల్లులకే వెళ్ళి తూకాలు వేయించు కోవాలి. యార్డులో తూకం సదుపాయం లేక పోవడంతో రైతులు విధిలేక జిన్నింగ్ మిల్లుల దయాదాక్షిణ్యాల మీద ఆధార పడాల్సి వస్తోంది. క్వింటాలుకు రెండు నుంచి నాలుగు కిలోలు హెచ్చుగా ఇక్కడ తూకాలు జరుగు తుంటాయి. ధర నిర్ణయం కూడా జిన్నింగ్ మిల్లులు నిర్ణయించే గ్రేడ్ల పై ఆధారపడి వుండడంతో రైతు మోసానికి గురి కావడం సర్వ సాధారణమై పోయింది. చట్టం ప్రకారం మార్కెట్ ఫీజు వసూలు చేసుకుంటున్న మార్కెట్ కమిటీలు రైతుకు రక్షణ కల్పించడంలో ఘోరంగా విఫల మవుతున్నాయి.

రాయలసీమ ప్రాంతానికొస్తే ఒక్క ఆదోని మినహా మరెక్కడా పత్తి యార్డులోకి రావటం లేదు. అక్కడ కూడా కొనే వారిదే ఇష్టా రాజ్యం. ఇతర చోట్ల యార్డు సదుపాయం లేక పోవటంతో బ్రోకర్లు గ్రామాల్లోనే తూకాలు వేసి పత్తి కొనుగోలు చేస్తుంటారు.

### విద్యుత్ కోత - వ్యాపారుల అరాచకం

సమస్యల కొలిమిలో కాలిపోతున్న పత్తి రైతు పై విద్యుత్ కోత సమ్మెట దెబ్బ లాగ పడుతున్నది. విద్యుత్ కోత కారణంగా జిన్నింగ్ మిల్లులు పూర్తి స్థాయిలో నడవటం లేదు. ఫలితంగా పత్తి నిల్వలు పేరుకు పోయి కొనుగోళ్ళలో మాంద్యం ఏర్పడు తోంది. అలా కొనుగోళ్ళు నత్తనడకలో వున్నప్పుడు ధర కూడా తగ్గిపోతుంది. కొన్న పత్తినే జిన్నింగ్ చేయించు కోలేక వ్యాపారస్తులు సతమత మవుతుంటే - పత్తిని ఎలాగైనా అమ్ము కోవాలని రైతు యాతన పడుతున్నారు. రైతు బలహీనతను వ్యాపారస్తులు తమ లబ్ధికి ఉపయోగించు కుంటున్నారు. ఆరు గాలం శ్రమించి పండించే రైతు తన పంటను అమ్ము కోవటానికి పడుతున్న అవస్థ వ్యాపారస్తుల జేబుల్ని నింపుతోంది. రైతు పంటను న్యాయంగా, ధర్మ బద్ధంగా అమ్మి పెట్టే వ్యవస్థ లేక పోవటంతో పత్తి రైతాంగానికి అవస్థ తప్పటం లేదు.

విత్తిన నాటి నుండి పత్తిని రాబట్టే వరకు కష్ట నష్టాలన్నీ రైతులవే - ఈ విషయంలో రైతులకు ప్రభుత్వం ఇస్తున్న ప్రోత్సాహకాలు, సదుపాయాలు, రాయితీలు ఏమీ లేవు. పంట చేతికి వచ్చినా నష్ట పోయినా పెట్టుబడి, శ్రమ, బాధ్యత అంతా రైతుదే. కనీసం పంట చేతికి వచ్చిన తర్వాతైనా దాన్ని న్యాయమైన రీతిలో రైతుకు గిట్టుబాటు అయ్యే ధరతో అమ్మి పెట్టించే కనీస బాధ్యత అయినా ప్రభుత్వం తీసుకోవాలి. లేకపోతే పత్తి రైతుల వెతల కథల్లో మళ్ళీ "ఆత్మహత్య" సంఘటనలు ప్రత్యక్షం అయి తీరుతాయి.

## ఫైలు

మొదటి పేజీ కొరవ

గతంలో వంగవీటి మోహన రంగా అల్లర్లలో జరిగిన ఆస్తి నష్టానికి రాష్ట్ర ప్రభుత్వం పరిహారం చెల్లించింది. అదే బాటలో తమకు కూడా నష్ట పరిహారం చెల్లించాలని ఎన్టీఆర్ కుమారులు పెట్టుకున్న దరఖాస్తును అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం తిరస్కరించింది. ఎన్టీఆర్ మరణం తర్వాత ఎన్టీఆర్ కుటుంబ సభ్యుల మన్నన, మద్దతు పొందటానికి చంద్రబాబు తాజాగా ఈ ఫైలుకు కాళ్లు తెప్పిస్తున్నట్లు విశ్వసనీయ వర్గాల భోగట్టా.

## ఓట్ల కోసం

మొదటి పేజీ కొరవ

విక్రయించారు. ఆ స్థలం వివాదంలో పడటంతో బ్రిటీష్ కంపెనీ వారికి మరొకచోట స్థలాన్ని కేటాయించి, ఇక్కడ గార్డెన్స్ పెంచాలని అప్పుడు నిర్ణయించారు. ఈ 54 ఎకరాల్లోనే విద్యుత్ బోర్డుకు సంబంధించిన మీటర్ ఫ్యాక్టరీ, కార్యా లయాలు వున్నాయి. వాటిని కూడా ఖాళీ చేయించి, అక్కడ కూడా గార్డెన్స్ అభివృద్ధి చేయ మన్నారు. ప్రస్తుతం మార్కెట్ రేటు ప్రకారం ఇక్కడ చదరపు గజం 12 వేల రూపాయ లుంది. ఈ లెక్కన చూస్తె ఎన్టీఆర్ గార్డెన్స్‌కు కేటాయించిన 54 ఎకరాల భూమి విలువ సుమారు 200 కోట్ల రూపాయల పైనే వుంటుంది. ఇంత విలువైన స్థలాన్ని ఎన్టీఆర్ ఘాట్ పేరున కేటాయిస్తే విమర్శలు వస్తాయని ఊహించిన చంద్రబాబు ఎన్టీఆర్ గార్డెన్స్‌గా మార్చి పబ్లిక్ పార్కుగా చేశారు. ఇక్కడ గార్డెన్స్ అభివృద్ధికి పది కోట్ల రూపాయల్ని ఉన్న పళంగా ప్రభుత్వం మంజూరు చేసింది. వచ్చే మే 28 తేది ఎన్టీఆర్ జన్మ దినం నాటికి గార్డెన్స్‌కు రిబ్బన్ కత్తి రించాలని చంద్రబాబు ఉబలాట పడుతున్నాడు. అలాగే ఖైరతా బాద్ పై ఓవర్ బ్రిడ్జి నుంచి బుద్ధ పూర్ణిమ వరకు ఎన్టీఆర్ మార్గంగా పేరు పెట్టారు. ఇది గాక మొత్తం 23 జిల్లా కేంద్రాల్లోనూ, తిరుపతి, విజయ వాడ, హిందూపురంలోనూ ఎన్టీఆర్ కంచు విగ్రహాన్ని ప్రభుత్వ ఖర్చుతోనే ఏర్పాటు చేస్తారు. లోక్ సభ ఎన్నికలకు ముందే ఈ విగ్రహాల్ని ఏర్పాటు చేయాలని చంద్రబాబు తహతహ లాడుతున్నారు. అలాగే అఖిల భారత స్థాయిలో సినీ రంగానికి సేవ చేసిన వ్యక్తికి ఎన్టీఆర్ పేరిట అవార్డు ఇస్తారు. అయిదు లక్షల రూపాయల నగదును ఏటా దాని కోసం రాష్ట్ర ప్రభుత్వం కేటాయిస్తుంది. అలాగే విజయ వాడలో వున్న వైద్య విశ్వ విద్యాలయానికి ఎన్టీఆర్ పేరు పెడుతూ జీవో జారీ చేస్తున్నారు. కృష్ణా జిల్లాను ఎన్టీఆర్ జిల్లాగా మార్చే కార్యక్రమం కూడా ఆలోచనలో వుంది.

ఎన్టీఆర్ వంటి మహా నాయకుడికి తెలుగు జాతి యావత్తూ ఘనంగా నివాళులర్పించాల్సిందే. ఇందులో ఎవరికీ అభ్యంతరం ఉండదు. కానీ కేవలం రాజకీయ లబ్ధి కోసం నిర్దాక్షిణ్యంగా ఎన్టీఆర్‌కు వెన్నుపోటు పొడిచి, ఆయన్ను పదవీ భ్రష్టుడ్ని, రాజ్య భ్రష్టుడ్ని చేసిన చంద్రబాబు, ఇప్పుడు ఎన్టీఆర్ మరణం పట్ల మొసలి కన్నీరు కారుస్తూ, ఆయన సానుభూతి ఓట్లను తన వైపుకు తిప్పుకునేందుకు అధికారాన్ని యథేచ్ఛగా ఉపయోగించడం మాత్రం అంతగా రుచించడం లేదు.

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్ధ సంవత్సరం చందా రూ. 50/-

# అశ్రుతర్పణం



నా భార్య

## యరబాక శైలశ్రీ

29.1.96 సోమవారం స్వర్గస్తు రాలైనది. ఆమె ఆత్మకు శాంతి కలుగాలని భగవంతుని ప్రార్థిస్తూ ఆమె ఉత్తర క్రియలు

| | | |
|---|---|---|
| 7.2.96 తేది | బుధవారం | నిలుపు |
| 8.2.96 తేది | గురువారం | ఎత్తురేవు |

39, నౌరోజీ రోడ్, చెట్‌పట్, మద్రాస్‌లోని మా గృహమున జరుగును. బంధు మిత్రులకు తెలియపరుస్తున్నాము.

## యరబాక మీరారెడ్డి

మామ: యరబాక కృష్ణారెడ్డి
అత్త: యరబాక కౌసల్యామ్మ
కుమార్తె: సింధూరి
ఆడబిడ్డ: ఆరుగుంట ప్రతిమ
సోదరి: ప్రసూన మీరారెడ్డి
ఆడబిడ్డ భర్త: ఆరుగుంట హరకిషోర్ రెడ్డి
సోదరి కుమార్తె: సంజన
మేనల్లుడు: ఆరుగుంట శరణ్ కుమార్

ఫోన్:మద్రాసు 5324541

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore